114

ఏప్రిల్

1981

# సృజన



జైల్లో భగత్‌సింగ్

సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు. 2

ఈ సంచికలో....



---


సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు. 2

---

SRJANA is commended for use in Public Libraries in t
State by the Director of Public Libraries, Andhra Pradesh, H
Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

---

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithr
Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

**114**

ఏప్రిల్ 1981

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

---

## భద్రత X అలజడి

నిర్మాణాత్మకమైన నిరసనను నిర్మించకుండా ఆకలిగొన్నవారు, అన్యాయానికి గురైనవారు వీధుల్లోకివచ్చి ప్రభుత్వానికి శాంతిభద్రతల సమస్యను సృష్టిస్తున్నా [illegible] ఉద్యమంలో నిజంగానే ఇమిడివున్న సమస్యకూడ శాంతిభద్రతల సమస్య [illegible]కున్నదని తను చాల Conceptualise చేసి (సిద్ధాంతీకరించి) చెప్తున్నానను కొందరలా అనుకునేలా తన భాషాప్రౌఢిమతో భ్రమింపచేసి గతకాలపు తిరుగు నిర్మాణాత్మకమైందనీ, సమకాలపు తిరుగుబాటు విధ్వంసనకరమైందనీ తేల్చి ఒక విశ్వవిద్యాలయంలో మన విదేశాంగమంత్రి.

జీసస్‌ను ఆయన సమకాలికుల సిలువవేసారు. మార్క్స్ ప్రవాసంలో బతకాల్సి [illegible]ంది. గాంధీని కాల్చివేసారు. మనుజేశ్వరాధముల నీసడించిన సత్కవి హాలి[illegible]యి నిజదారసుతోదరపోషణ చేసుకోగలిగాడేమోకాని కాళోజీ మొదలుకొని విప్లవ[illegible]దాక తిరుగుబాటు చెప్పినవారు, చేసినవారు ఎన్నోమార్లు జైళ్ళపాలయ్యారు. [illegible]తున్నారు. కొందరెందరో తుపాకి గుళ్ళ పాలయ్యారు. గతంలోని తిరుగుబాటును [illegible]ణాత్మకమని ప్రశంసిస్తున్న మేధావి ముప్పైమూడేళ్ళుగా గద్దెమీదనో గద్దెకిందనో [illegible] మాత్రం ఆశ్రయించుకొనివున్నాడు. కాబట్టి ఇవ్వాళ ఆయనకు నిరసన, తిరుగు[illegible]ధ్వంసన, దౌర్జన్యాలుగా కనిపించడంలో ఆశ్చర్యంలేదు. ఇవ్వాళ ఎస్టాబ్లిష్

మెంట్‌కు కావలసింది భద్రత. పాలకజాతీయ భద్రత. ఆ భద్రతకోసం ఎన్ని చట్టాలని. ఎన్ని సైద్ధాంతిక సమర్థనలని.

ధన్‌బాద్‌లో, ఛత్తీస్‌ఘడ్‌లో, లోకోషెడ్‌లలో, ప్రెస్‌క్లబ్‌లలో, నల గొండలో, సింగరేణిలో ప్రభుత్వానికి కార్మికులనుంచి, గిరిజనులనుంచి, రైల్వే ఉద్యోగులనుంచి, ఎన్జీవోలనుంచి, రాజకీయ కార్యకర్తలనుంచి భద్రత లేదు. పార్ల మెంటు సభ్యుల నెలజీతం ఐదువందల నుంచి వెయ్యిరూపాయిలకు పెంచడానికి వీలు న్నది కాని ఎల్ఐసి ఉద్యోగులకు ఇదివరలోవున్న సౌకర్యాలను కొనసాగించడానికి కూడ బుద్ధిలేదు. ప్రభుత్వరంగ పరిశ్రమల్లో రెండున్నరనెలల ఉత్పత్తిని, కోట్ల రూపా యల నష్టాన్ని ఓర్చే శక్తివున్నది కాని అన్ని పరిశ్రమల్లోనూ కార్మికులకు సమాన జీతం ఇచ్చేఇష్టం లేదు. గుజరాత్‌లో రిజర్వేషన్ల వ్యతిరేక ఉద్యమాన్ని అణచడానికి పేల్చే తుపాకుల్లోంచివచ్చే ఇందిరా బులెట్లు అగ్నిబాష్పాలు హరిజనుల ప్రాణాలనే హరిస్తాయి. ఇందిరా కిసాన్ ర్యాలీకోసం ఇండియన్ రేల్వేని అట్టహాసంగా ఢిల్లీమార్గం పట్టించి ఆర్ ఎస్‌యు పిడిఎస్‌యు సభల మార్గాలు దిగ్బంధం చేయబడతాయి. ప్రవ హించేనీరు దారులు వెతుక్కుంటే లాఠీచార్జీలు, అరెస్టులు, జరిమానాలు, హత్యలు. పల్లెలోనో, ఢిల్లీలోనో ఎవరైనా ఒక పాత్రికేయుడు నిజాయితీతో నిజాన్ని రిపోర్టు చేస్తే అతని గొంతునులుముతారు. అతని స్త్రీని చెరుస్తారు. వ్యాపార విషపత్రికలైన పత్రికల్లో వ్యాపారసరళిలో కాకుండా వాస్తవాలు రాయప్రయత్నిస్తే నోట్లో వ్యాపారి మూత్రం పోస్తారు పత్రికలపై సెన్సార్ సాధిస్తారు. ఆర్డినెన్సులు బిల్లులవుతాయి. బిల్లులు చట్టాలవుతాయి. చట్టాలునల్లవని అరచినగొంతులు ప్రతిఘటించిన ఉద్యమాలు ప్రభుత్వాల దృష్టిలో దౌర్జన్యపూరిత చర్యలవుతాయి.

మార్క్సుదాకా ఎందుకు బెంగాల్ కరువుకాలంలో తిండికి మలమలమాడి చస్తున్న ప్రజలను ధాన్యాగారాలను పగలగొట్టి ఆహారం సంపాదించుకొమ్మని 'రెచ్చగొట్టాడు' జవహర్‌లాల్ నెహ్రూ. బ్లాక్‌మార్కెటీర్లను కరెంట్ స్తంభాలకు ఉరితీసి వేలాడదీయా లన్నాడు. అప్పుడాయన ప్రధానికాలేదు. అందువల్ల అది నిర్మాణాత్మకమైన నిరసన. మే '74 సృజనలో ఒక అజ్ఞాతకవి గాదెలనిండావున్న ధాన్యాన్ని నల్లబజారు పంది కొక్కుల బారినుంచి ప్రజల నందుకొమ్మని చెప్పితే అది రాజద్రోహం. అసెంబ్లీ ఎన్నికల పర్యటనలో జగిత్యాల సభలో భూమికోసం, నీడకోసం హరిజన గిరిజన ప్రజల అవసరాలు తీర్చడానికి ప్రభుత్వంయుద్ధ ప్రాతిపదికపై పూనుకోకపోతే రక్త పాత విప్లవం తప్పదని చెప్పింది ఇందిర. అప్పుడామె ప్రధానికాదు. అయినా అది

నిర్మాణాత్మక ఉద్యోధ. అదే జగిత్యాలలో ఏడాది తిరిగాక రైతుకూలీ సంఘం 'దున్నేవానికి భూమి కోసం' 'రక్తపాత విప్లవాని'కి పిలుపునిచ్చింది- నిస్సంశయంగా ఇది నిర్మాణనను రెచ్చగొట్టే విరసన।

ప్రజల విరసనలోని బాగోగులను ప్రజలు చర్చిస్తే పట్టించుకోవచ్చు. సాను భూతితో అర్థంచేసుకోవడానికి ప్రయత్నించనూవచ్చు. తిరుగుబాటులో 'అరాచక' ధోరణి ఏమైనా మరొక తిరుగుబాటుదారు వేలెత్తిచూపితే ఆత్మవిమర్శ చేసుకోవచ్చు. సరిదిద్దుకోవచ్చు- పాఠాలు, గుణపాఠాలు తీసుకోవచ్చు. కాని సోషలిజంపేరుతో అమలవు తున్న నియంతృత్వానికి, ఎమర్జెన్సీకి, అప్రకటిత ఎమర్జెన్సీకి సేవలుచేస్తూ, ఈ పీడిత భద్రతను ప్రతిఘటిస్తున్న ఉద్యమాలు వీధుల్లోకే కాదు ఊళ్ళ వేర్లనుంచి దేశపు రక్త నాళాల్లోకి, ప్రజల ఊపిరితిత్తుల్లోకి ప్రవహిస్తుంటే వీటికి విధ్వంసనలని పేరుపెట్టేవాని వైదుష్యమెంతదయినా అది కుహనా మేధావిత్వమే.

'ప్రపంచ తెలుగు మహా సభలు'

## 'ఇసుకలోన తల దూర్చిన ఉష్ట్ర పక్షి బాపతు!'

ఏంసాధించామని ప్రపంచ తెలుగు మహాసభలు మళ్ళా। ప్రపంచంలో తెలుగుకు ఏ స్థానాన్ని సాధించామన్నది కూడా కాదుప్రశ్న. తెలుగు ప్రపంచంలోకి తెలుగు ప్రజల జీవన తెలుగును, వెలుగును ఏమైనా తేగలిగామా? తెలుగుభాషా రాష్ట్రంలో తెలుగింకా అధికారభాష అయిందా? తెలుగు విశ్వవిద్యాలయాల్లో తెలుగు ఏస్థాయివరకు బోధనా భాషఅయింది? అయినచోట ఏ స్థాయిలోవుంది। భూమి, విద్య, న్యాయం, ఆరోగ్యం మొదలైన ప్రజల ప్రాథమికావసరాల్లో వర్గంతోపాటు భాషకూడ ఎంత ప్రతిబంధకమై పోయింది।

సంస్కృతం, ఉర్దూ, ఇంగ్లీషు, గ్రాంధికం, గొలుసురాత, రెవెన్యూభాష, కోర్టుభాష, డాక్టర్లలిపి ఎన్నిరూపాల్లో ప్రజల అవగాహనకు భాష అడ్డుగోడై నిలు స్తున్నది। తెలుగు ప్రజలనుంచి తల్లిపోల్చుకోలేని వేషంలో బిడ్డలాగ, తల్లికళ్ళకందని గద్దెమీద బిడ్డలాగ తెలుగు ఎంతబంధనాల్లో। ఆ బంధనాల్లో భాగమే ఈ ప్రపంచ తెలుగు మహాసభలు.

ప్రథమ ప్రపంచ మహాసభలు జరిగిన 1975కు ఈ ఆరేళ్ళకూ తెలుగు ప్రపంచంలో మనం సాధించిందేమిటి? సభలైపోయిన కొద్దిరోజుల్లో సభల పేరుమీద ఎందరెందరు పెద్దలు ఎన్నెన్నిలక్షలు తిన్నారన్నవివాదం. ఇంతలో అన్ని భాషారాష్ట్రాల తోపాటు ఇందిరా వెంగళరావులు తెచ్చిన ఎమర్జెన్సీ సంస్కృతి. ఇరవైసూత్రాలమీద,

కాదు ఇరవైనాలుగు సూత్రాలమీద, 'అపరకాళి' ఇందిరమీద, కాదు 'ఉదయించే సూర్యుడు' సంజయ్‌గాంధీమీద, 'ఫాసిజాన్ని' ఎదుర్కొని 'ప్రజాస్వామ్యాన్ని' కాపాడడానికి తెచ్చిన ఎమర్జెన్సీమీద, ఆస్థానకవులు, ఆశ్రితకవులు మొదలుకొని అభ్యుదయ కవులదాకా పోటీపడి ఉత్పత్తిచేసిన కళలు, సాహిత్యం, సభలు, సంరంభాలు సమారోహాలు. మరొకవైపు భూస్వామ్యం రివిజనిజం గుండాయిజానికి విరసం కార్యవర్గ సభ్యుడు పరిటాల శ్రీరాములుబలి.

'ప్రజాస్వామ్యా'న్ని కాపాడడానికి ఎమర్జెన్సీ విధించిన ఇందిర నిర్వహించిన 'ప్రజాస్వామిక' ఎన్నికల్లో ఇందిర ఓడిపోయింది. ఎమర్జెన్సీ ఎత్తివేసింది. 'ప్రజాస్వామ్యాన్ని' పునరుద్ధరించడానికి 'జనతా' ప్రజాస్వామ్యం వచ్చింది. రచయితలపై, కళాకారులపై, మేధావులపై, విప్లవకార్యకర్తలపై, విద్యార్థులపై, స్త్రీలపై- ఒక్క మాటలో తెలుగుప్రజల పోరాటాలు, సాహిత్యం, కళలు, ఆలోచనల్లో భాగమైన కార్యకర్తలపై కుట్రకేసులు కొనసాగుతూనేవున్నాయి. ప్రపంచ తెలుగుసభల భాండాగారం ఎండిపోయి తెలుగు సంస్కృతి రాబందులు ఆకలిగొన్న సమయంలో ఉప్పెన వచ్చింది. భావదేవరపల్లి గోదాములు నిండిపోయాయి. భావనామయ ప్రపంచమంతా ప్రళయజలాలేకదా! మిగిలిందేమైనావుంటే తెలుగు పాలకమండలి దోచుకున్నది. తానుంటే తుఫానులు, ఉప్పెనలు వచ్చేవికావని తెలుగుదేశంలో తుఫానులా ప్రయాణం చేసి ఇందిరాగాంధీ తిరిగివచ్చింది. కుట్రకేసులు కొనసాగుతూనేవున్నాయి. కామ్రేడ్ జ్ఞానేశ్వర్‌కీర్తి హత్యచేయబడ్డాడు. కామ్రేడ్ నాగభూషణ పట్నాయక్ జైల్లో, ఆసుపత్రిలో, అనారోగ్యంలో / ఉరిశిక్ష యావజ్జీవ శిక్షగామారి / మృత్యుద్వారాల దగ్గర జీవనగీతం నిబ్బరంగా వినిపిస్తూనే వున్నాడు.

వానలులేవు, వస్తువులు లేవు, ధరలున్నవి. కరువున్నది. కరువు నిజమయింది ప్రకృతి ప్రకృతయితే కరువు కృత్రిమమయింది ప్రభుత్వ ప్రకృతి. ఇప్పుడీ ప్రపంచ తెలుగుసభలు ప్రభుత్వం కౌలాలంపూర్ ఇసుకతిన్నెల్లో తెలుగు దేశం భయంకర వాస్తవాల నుంచి పారిపోయి తలదూర్చడానికి. అయితే అందుకయినా అక్కడ నిర్మాణ మద్యే ఇసుక మేడలకు, లక్కవాడలకు ఎన్ని లక్షల ప్రజల ధనం దుర్వినియోగం కాబోతున్నది అన్నది ప్రశ్న- ప్రపంచ తెలుగు సభలుజరిపే అర్హత ఈ ప్రభుత్వానికి లేదు. కనుక కరువుకాలం అని వాయిదావేయడం కాదు, ఈ సాంస్కృతిక కుట్రను కట్టిపెట్టకపోతే గట్టి ప్రతిఘటనను ఎదుర్కొంటావని ఎలుగెత్తి చెప్పాల్సిన తరుణమిది.

— సంపాదకుడు

25-3-81

గుడిహాళం రఘునాథం - కవితలు రెండు :

# పద్యంలో ఇమిడిపోవాల్సిన అందం

అందం నన్ను మోసం చేస్తుంది
నాకు తెలీకుండా నా పద్యం వెనక దాక్కుంటుంది
నన్ను నా ప్రజల్నుండి దూరంచేస్తుంది
నేను సంఘంలోని బీభత్సాన్ని చెప్పేప్పుడు
నా గొంతును దారిమళ్ళించి సౌకుమార్యంలోకి దింపుతుంది
ఆచార దుర్వాసనల్ని ప్రస్తావించేప్పుడు
పదసౌరభాల్లో నన్ను పడదోస్తుంది
నేను ఎడారుల్ని గురించి చెబుతుంటే
అలంకరించటానికి
మల్లెతీగల్లాంటి పదచిత్రాల్ని నా చేతికి అందిస్తుంది
తొంగి తొంగి చూస్తున్నదొక్కసారిగా
మీకూనాకూ మధ్యతెరై వాల్తుంది
అప్పుడు నేను బహుశా సాంఘిక హత్యల్ని గురించి
మాట్లాడుతుంటాను
చట్టబద్ధ హింసాకాండల్ని గురించి ఆలోచిస్తుంటాను

X X X X

తెర తొలగిస్తే హత్య।
హత్య, మనుషుల్ని చంపటం మాత్రమేకాదు
మనిషిముఖంలోని సూర్యుణ్ణి చంపటం హత్య
ఎర్రగామొలకెత్తే హృదయానికి
నీళ్ళు పోయకపోవటం హత్య
భ్రమల్లో మనిషిని కనగ్గింజలా నానబెట్టడం హత్య
మొలకెత్తే నిరాశా తత్వశాస్త్రాల్ని
విశ్వవిద్యాలయాల్లో పెంచిపోషించడం హత్య-
థార్ ఎడారి రాజస్థాన్‌లో మాత్రమే కాదు
మన మనసుల్లో ఉంటుంది
ఓట్ల డబ్బాలో ఉంటుంది
ప్రజల సంపద కొల్లగొంటూ పాలకవర్గం పెట్టుకున్న

మంత్రివర్గంలో ఉంటుంది
సహారా ఉండేది ఒక్క 'ఆఫ్రికా'లోనే కాదు
దోపిడీకాండంలో ఉంటుంది
దౌర్జన్యంలో ఉంటుంది
భగల్పూర్ పోలీస్ స్టేషన్‌లో ఉంటుంది
కళ్ళను నాశనం చేయటానికుపయోగపడే
ఆసిడ్‌లలో ఉంటుంది ఇనుపసువ్వల్లో ఉంటుంది
ఢిల్లీ దర్బారులో ఉంటుంది
వ్యవస్థలో ప్రతిదినమూ విస్తరిస్తూపోయే ఎడార్లు
సామూహికహత్య
చుట్టూ విస్తరించే ఎడారుల్ని
పట్టించుకొని పలాయనవాద, అరిసవాద మనస్తత్వం హత్య
రూముల్లో తపస్సుల హత్య
పత్రికలో తుపాకీ గుళ్ళనీతి
రేడియోలో తుఫానుల ప్రశాంతతా
తెరపై ముసలినాయకుల శృంగార సన్నివేశాల బురద హత్య
అభ్యుదయం ముసుగేసుకున్న సినీసింహం – కొయ్యకత్తి
విప్లవం ముసుగేసుకున్న భావకవి – పేలని తుపాకీ
రంగంపై కొయ్యకత్తి, పేలనితుపాకులూ ఊరేగటం హత్య
వాటిని మోసుకొనితిరిగే వెన్నెముక లేని కవిరోగులు హత్య
పద్యంలో ఇమిడి పోవాల్సిన అందం
పద్యంముందే
తెరగావాలటం హత్య

X X X X

నిజం నీకుతెలుసు
అయినా చెప్పకుండా
దేనికోసమో వెదుకుతుంటావ్
ఎండనిన్ను ప్రశ్నిస్తుంది
వాన నీదేహాన్ని తడిమి తడిమి నిజంచెప్పమని
అనునయిస్తుంది
గాలినిన్ను తోసి మరీ దబాయిస్తుంది

రహస్యాన్ని కక్కమంటుంది
ధూళి నిన్ను వెంబడిస్తుంది
తుఫానులు నీగొంతులోకి ప్రవేశిస్తాయ్
నీవేమో మూగవోయి ఏదో పిచ్చి అన్వేషణలో ఉంటావ్
సమస్యలు నిన్నాలంబనం చేసుకుంటాయ్
నీవుకూలిపోతావ్ అయినా దేవులాడుతూనే ఉంటావ్
సంఘం నిన్నొదలదు
సత్యం నిన్నొదలదు
భీభత్సంనిన్నుకుక్కలా వేటాడుతూనేఉంటుంది
కళ్ళు మూసుకొని
నీవేమో
అందమైన అలంకారాల కోసం నీ చుట్టూ బురదగుంటల్లో
వెదుకుతూనే ఉంటావ్

నిరాటంకంగా పరోహత్య జరిగిపోతుంది
పద్యంలో ఇమడాల్సిన అందం
పద్యం ముందే తెరగా వాలిపోతుంది

X X X X

అప్పుడు నీవు చట్టబద్ధ హింసాకాండల్ని గురించి
ఆలోచిస్తుంటావ్
అప్పుడు బహుశా నువ్వు సాంఘిక హత్యల్ని గురించి
ఆలోచిస్తూఉంటావ్

పల్లెతీగెల్లాంటి పదచిత్రాల్తో
ఎడారి నిజాల్ని అలంకరిస్తూ ఉంటావ్
ఆచార దుర్వాసనల్ని ప్రస్తావిస్తూ
పదసౌరభాల్లో పడిపోతూ ఉంటావ్
సంఘ బీభత్సాన్ని చెబుతూ దారితప్పి సౌకుమార్యంలో
ఈదులాడుతుంటావ్

ప్రజల్నుంచి దూరంచేయబడి ఉంటావ్
అంతే
నీకుతెలీకుండా నీ పద్యం వెనకదాక్కుని
అందం నిన్ను మోసంచేస్తుంది
అందం నిన్ను వికృతం చేస్తుంది
నీ పద్యంలో ఇమడని అందం
నిన్ను నిలువునా ముంచేస్తుంది

# మంచు కురుస్తుంది

మంచుకురుస్తుంది
మంచులో క్రమంగా ఒక్కోటీ కనుమరుగౌతాయి
ఇళ్ళు కనబడవ్
దూరంగాఉన్న కొండలు ఆశ్చర్యకరంగా అదృశ్యమౌతాయి
నేను చిన్నప్పుడు చాలాసార్లెక్కిన ముసలిచెట్టు కనబడదు
మనుషులూ కనబడకుండా పోతారు
ఆకాశమంతా వెల్లవేసినట్లనిపిస్తుంది
ఇప్పుడు నా ఆయుధమల్లా నాకంఠమే
నాకే ప్రమాదమూ రాకుండా చూసుకోటంలో
చెవి కవచమౌతుంది
ధ్వని నా సాధనమౌతుంది
మంచుకురుస్తుంది
మంచులో నా పక్కన జరుగుతున్నవే చూళ్ళేకపోతున్నా
మా ముసలితాతని చూళ్ళేకపోతున్నా
ముసలితాత కుంటి కుక్కని చూళ్ళేకపోతున్నా
రాత్రి నాన్నచేత తిన్నతిట్లూ, తన్నులూ గుర్తుకుతెచ్చుకొని
దుఃఖిస్తున్న అమ్మను చూళ్ళేకపోతున్నా
మా గుడిసెదురుగా మీసాలదొర కొండా చూళ్ళేకపోతున్నా
కానీ నాచెవి పనిచేస్తూనేఉంది
దృశ్యాన్ని గ్రహించటంలో చెవి కన్నౌతుంది
ధ్వని కాంతౌతుంది
మంచు మరీదట్టంగా కురుస్తుంది
నా ఉనికి నాకే కనబడనంత దట్టంగా కురుస్తుంది
నా స్పర్శతో నన్ను నేను తెలుసుకుంటాను
నా కంఠంతో నా ఉనికిని తెలుపుతూనే ఉంటాను
కంఠమూ, ప్రాణమూ కలుపుకున్న స్నేహం నా ప్రస్థానం
మంచు కురుస్తుంది
నేనిప్పుడు మరింత జాగ్రత్తగా వింటున్నా
మంచురహస్యం నాకు బాగా తెలుసు

మంచులో దుఃఖం కనబడనైతే కనబడదుకానీ
ఆర్తనాదాలు వినబడతాయ్
మంచులో దృశ్యం కనబడనైతే కనబడదుకానీ తిరుగుబాటు
నినాదాలు వినబడతాయ్
మంచులో దృశ్యం కనబడనైతే కనబడదుకానీ
తుపాకీ కాల్పులు వినబడతాయ్
మంచు కురుస్తూనేఉంది
కాదు,
కురిపించబడుతూనేఉంది
దట్టంగా, మరింతదట్టంగా–
నాఉనికి నావాళ్ళకు తెలియాలన్నా
వాళ్ళఉనికి నాకుతెలియాలన్నా
ధ్వనిమాత్రమే సాధనం
కంఠం నా ఆయుధం
శబ్దమూ, నాప్రాణమూ ఒకదాన్నొకటి
పెనవేసుకొని 'మార్చ్' చేస్తున్నాయ్
నన్ను తప్పుదోవ పట్టించటానికి
ఈ పొగమంచెప్పుడూ, ఎప్పుడూసిద్ధం
మంచును చీలుస్తూ నేనుసిద్ధం
నాచేతిలో ఓతుపాకీసిద్ధం
తుపాకిలో ఒక సూర్యుడుసిద్ధం
మంచు కాగితప్పులిలా గాండ్రిస్తూనేఉంది

## చిన్ననాటి జ్ఞాపకాలు

దామెర రాములు

చిన్ననాటి జ్ఞాపకాలు
నా స్మృతిపథంలో సుళ్ళుతిరుగుతూనే ఉంటాయి....
తెల్లారకముందు
మొక్కజొన్నకంకులేరడానికి
మాతల్లి కూలికెళ్ళినరోజు
కూలికంకులుదెచ్చి, దంచి, వండి
వేడివేడిజావపూటకు కాసిపోసినపుడు
మాడేకడుపుకుతోడు, కాలేనాలుక

అయినా కడుపుమంటకు తింటూంటే
మాతల్లి కారుస్తున్న కన్నీళ్ళు
అప్పుడేఅర్పిన చొప్పదంట్ల పొయ్యిమీంచి
మామీద జాల్వారుతూంటే
ఆ కన్నీళ్ళ ఉడుకునీళ్లే
రెండుచేతులాతాగి
'అవ్వా ! ఎందుకేడుస్తావే ?' అంటే
గాలికి ఎగిరిపోతున్న గుడిసెకప్పలు
దండెంమీద వేళ్లాడుతోన్న గుడ్డపేలికలు
వాకిట్లో పశులోడువేసే కేకలవైపుచూస్తో
మరీ బావురుమంది....
చిన్ననాటి జ్ఞాపకాలు
నామనిస్సులో తుఫానులు రేపుతూనేఉంటాయి....
ఇంటికి
పొలంనుంచి
డొక్కని నడుంకికట్టుకొని
దూరంగా అడివిలో
నక్కలుకూతలు పెడుతూఉంటే
తుమ్మచెట్లమధ్య
తుంగగడ్డి గుడిసెలమధ్య
తిక్కరేగి కుక్కలు మొరుగుతూఉంటే
చీకట్లో చీకటిగా తిరిగొచ్చినరోజు
'అవ్వా ! ఇంతఆలిసమెందుకైందే ?' అంటే
మమ్మల్ని
తనకడుపులో దాచుకుని
కుములుతూ
మా తలలపైకి చేతులుపోనిచ్చి, దువ్వుతూ
చీకట్లోకిచూసి
గోడమీదపెట్టిన గుడ్డిదీపం వేపుచూస్తో
రెండుచేతుల్లో ముఖాన్నిదాచుకుంటో

ఆకాశం వూగిపోగా
భూమిఅదిరిపోగా బిగ్గరగా ఏడ్చింది....
చిన్ననాటి జ్ఞాపకాలు
నన్ను వేకువవేపు నడిపిస్తుంటాయి
తిన్న రెండు మెతుకులు
పేగుకి ఓమూలకికూడా సరిపోక
నేలమీద నిద్రరాక దొర్లుతూ, పొర్లుతూ
నత్తగుల్లలా ముడుచుకొన్న రోజు
నడిజామురాత్రిదాటి
పూలసుక్క పొడుస్తోందనగా
మాతల్లి
మోకాళ్లమీద తలఆనించి
పేరు పేరునా
ఊరు ఊరునా బంధువులను తలచుంకుటూ
పాడురోజుల నెమరువేస్తో
భోరు భోరున ఏడుస్తోంటే
"అవ్వా! ఆకలైతందే!" అంటే
మూలసుక్క వేపు సూపి
నక్షత్రాల కాంతుల కింద
మమ్మల్ని ఓదార్పుతో
ఉదయం హృదయం పగిలేలా
ఇంకా పెల్లుబుకుతూ ఆమె దుఃఖించింది....
చిన్ననాటి జ్ఞాపకాలు
నన్ను ఆయుధంగా మలుస్తూనే ఉంటాయి
మా వాడలో
కొత్తగా బడిదెరిచి
తెల్లగుడ్డల మనుషులొచ్చిన రోజు
మమ్మల్నందర్నీ బళ్లోచేరమని
దొరబాబుతో సహా
గాంధీతాత బొమ్మ వేపు చూపించినపుడు

మేం నిజంగా చదువుకొంటున్నట్టే సంబరపడి
మర్నాడు
దున్నపోతులవెనుక దుడ్డుగర్రతో
మమ్మల్ని పశేలోడు తరిమినపుడు
మేం చదువుకో బోతామంటే
వాళ్ళంతా వాయగొడుతూంటే
దూరంగా చేన్లో కలుపుదీస్తో
మాతల్లి
లేగదూడలమీద పులిబడ్తే ఆవు ఆక్రోశించినట్టు
కలుపు మొక్కలు పెరికివేస్తో
జొన్న కర్రల్లో తానొక కర్రయి
పంటచేలో పెరిగి పెరిగి
భోజ్యంగా సమాధిగా మారినప్పుడు
మా లేత మనసులు మరిగి మరిగి
మా కన్నులు చెరిగి
నా చిన్ననాటి జ్ఞాపకాలే
నన్ను విప్లవకారుణ్ణి చేస్తాయి

విప్లవ విద్రోహాల దౌష్ట్యానికి బలైన రాడికల్ యువజన నాయకుడు కా॥ మేద్ జన్ను చిన్నాలు స్మృతికి లాల్ సలామ్స్‌తో ఈ కవిత అంకితం.

## హాట్ పార్టీ

ఈ దేశం
పెద్దమనుషుల విందుభోజనశాల
ఇక్కడ రోజూ విందులే
రాజ్యాంగం 'స్ట్రా'తో
రక్తాన్ని పీలుస్తారు
ఎదురుతిరిగిన వేడిరక్తాన్ని
'ఎన్‌కౌంటర్' రోజున
హట్‌పార్టీ చేసుకొంటారు

— రమేశ్

## జవాబు

ఎన్నార్ 'భోలా'

వొలియ పంటలు పండించే
అన్నల కూలి గింజల
బాధలు

ఆకలి కొలిమిలో
ఎరుపెక్కి ప్రశ్నించిన
కూటి కటకటల కారణాలు—

భూస్వాముల దొరబాబుల
కొనుగోలులో అమ్ముడైన 'న్యాయా'లు
పేదల కూటికి చంపి
కోటికి కోటి పెరిగితే:

'ఇంకానా ఇకపై సాగదు'
అన్నవాని గుండెల్లో గుచ్చిన
నేరస్థుల లైసెన్సు బాయ్‌నెట్‌కు

చావు చావుకో తూటా తూటా
అధికారం పెరిగింది—

కిరాయి తూటాలకు
కూలి జనాలు జవాబిచ్చినయ్
కూలి జవాబు కాదు
భూమి పొరలు చీల్చుకొని
పదునెక్కిన నాగలి జవాబు
గడించిన నరకమంతా
తిరిగి వప్ప జెప్పుదామని
సోమరి దొరలకు బెదురుగ
అక్రమ హంటర్‌లకు ఎదురుగ
అరకలు పట్టిన పిడికిళ్ళు
నడిచినయ్

---

## ఈ చేతులకు పని ఇవ్వండి

రైల్లో కూర్చుని ప్రకృతి
అందాల్ని తిలకిస్తున్న
నా కాళ్ళ వేళ్ళకి తగిలిన
సుతిమెత్తని స్పర్శ
ఓ చిన్నారిది!
ఓ పసి కందుది!
ఇంకా వికసించని
చిరు మొగ్గది!
నేను తిని పారేసిన
చెత్తని తుడిచి,
ఆ మురికి చేతినే
మూడు పైసలకు

చాపాడా బిడ్డడు!
కడుపు కాలుతున్నా
అడుక్కోవడం
ఇష్టంలేని చేతులవి!
వికసించని మొగ్గలో
వికసించిన ఆత్మాభిమానం అది!
ఇప్పుడు, ఈ బ్రతుకు దుమ్ములో
పొర్లాడుతున్న ఈ మొగ్గలు నిగ్గుదేలితే
వాళ్ళు పొర్లాడుతున్న మసిజాగే
నేర్పుతుంది జీవితపాఠం!
ఎర్రగా పండినపుడే జీవ ముందని!

— సునీత

## *కిసాన్ ర్యాలీ

సంక్రిమ్

మంత్రి : రారో రైతన్నా
రైతు మహాసభలో జేర

రైతులు : రామయ్యో మంతిరయ్యో
గాడి ఖర్చు దిక్కులేదు

మంత్రి : నూటయాభై గాడీలల్ల
ఏ గాడీ ఎక్కుతావు
ఇరవై వేల బస్సులల్ల
ఏ బస్సు ఎక్కుతావు
అయిదువేల ట్రాక్టర్లలో
ఏ ట్రాక్టరెక్కుతావు
ఇందిరమ్మ తలుసుకుంటె
ఏదానికీ కొదువలేదు

రైతులు ; బహు సిత్రంగున్నది మీ
యిందిరమ్మ బాగోతం
టికటుకు పైసల్లేకా
కాలినడకనెల్లె టోల్లం
భూమి కొరకు బువ్వకొరకు
లడాయీలు జేసె టోల్లం
కొత్త ఢిల్లీ మోజులబడి
కొట్టుకపోయె టోల్లంగాదు

మంత్రి : లడాయీలు చేసి చేసి
అలిసిపోయి వున్నరు
లొల్లి పోయే మార్గమేదో
సల్లంగా జేస్త బంటి
వద్దు వద్దు వద్దు వద్దు
ఎనుక ముందు జెయ్యొద్దు
కొత్త ఢిల్లి దీక్ష యాత్ర
కోటి జన్మ పుణ్య ఫలం

రైతులు : దీక్ష యాత్ర నడిపి మమ్మల
నడిగంగల ముంచినారు
నాగపూరు బాగోతం
ఆగి పోయిపోక ముందే
అమ్మగారు ఢిల్లిలో
గదే మాట అంటున్నది
గద్దె పట్టు గావాలని
పట్టు పట్టుతున్నది

మంత్రి : అదిగాదు యిదిగాదు
అదీ యిదీ ఏది గాదు
స్థిరంలేని మీ బతుకుల
స్థిరం జేయటానికొరకే
పంట గిట్టుబాటు ధర
కొంతైనా పెరుగుతాది
పాత పగలు మరిసిపోయి
కొత్త సోపతి జేస్తాము

రైతులు : పిల్లులకు ఎలుకలకు
పొత్తెట్లా కుదురుతాది
కోడిపిల్ల, గద్దలకూ
సోపతెట్ల కుదురుతాది
రోజు కొక్క బాగోతం
మీరు ఏసినా గాని
ఈ రోతను కాల్చేదాక
పాత పగలు వీడము
రామయ్యో మంతిరయ్యో
మీ ఢిల్లీ పట్నానికి ॥రా॥
మీ ఢిల్లీ నోడించీ
కట్జ జేసుకొనేదాక ॥రా॥

కథ :

# నాదె...

ఎ. ఎస్.

కుయ్యి కుయ్యి మంటు కుమూలుకుంటూ నాదె కొట్టే నేత కార్మికుడు సరాల్ని దారాలుగా జేసి పోగుపోగు అతికి బట్టల్ని నేసే సాలీవాడు ఇప్పుడు మొగ్గం గుంటలో కూర్చోలేదు. పెట్టిన పడుగు అట్లాగే మూలకుపడి, దారాలు దుమ్ముపట్టి వున్నాయి.

ఎందుకు ?....

పిడికెడు స్వేచ్ఛ కావాలన్నందుకు.... స్వేచ్ఛ లేదా ?.... రాయికాల మీద అందంగా రాసివుంది....ఇంకేం.... మరి స్వేచ్ఛేమిటి?....అతనొక్కనికేకాదు అపల్లెకు ఆపల్లెకు కూడా స్వేచ్ఛకావాలి పిడికెడు స్వేచ్ఛంటే మాటలా? ఇవాళ స్వేచ్ఛంటాడు- రేపు.... భూమి.... ఆ తరువాత అధికారం కావాలంటాడు.... అందుకే వాళ్ళు.... వాళ్ళు.... వణికిపోయారు.... వాళ్ళ కాళ్ళ కిందిమట్టి కళ్ళల్లో పడ్డట్టయ్యింది. కాలి కింది చెప్పు చెంపదెబ్బ గొట్టినట్టుగావుంది.... అందుకే....మొగ్గం విరిగింది....రాట్నం తిరగడం లేదు.... ఆ రాట్నం వడికే అచ్చవ్వ చెయ్యి విరిగింది- కాదు.... విరిచారు- వాళ్ళు రాక్షసులు....యుగాలుగా, ఏళ్ళుగా ఆ అవ్వలాంటి వాళ్ళ చేతులు ఎన్నోవిరిగాయి మానవ మాతృలేకాదు యంత్రభూతాలు విరిచాయి.... ఎంత నిర్దయగా నీడనిచ్చే చెట్టును- పంట పండే భూమిని- కప్పుకునే గుడ్డలుకాల్చి తినే కూట్లో మన్నుబోసే....

అది చిన్నపాక లోపలికి వెళ్ళా.... నాతోపాటు రివ్వున గాడుపువచ్చింది....నాదే వూగింది....

"ఎవరు నువ్వు ?"

"నేను...." ఏంచేప్పాలి అని ఆలోచనలో పడ్డ....

"పలకవేం" మళ్ళీ ప్రశ్న....

"నేను రచయితని.... ఇక్కడ జరిగిన వాస్తావాన్ని బయిటి ప్రపంచానికి తెల పాలని వచ్చాను...." టక టక చెప్పేశాను

"నువ్వు రచయితవా" ?.... పకాల్న నవ్వుతూ వూగింది....

"ఎందుకు నవ్వుతున్నావ్"

"ఎందుకా ? మీరు చదువుకున్న తెలివైన మూర్ఖులు ఎందుకంటే ? ఓ సామెత గుర్తుందా ?.... తినేది మెుగుడిది.... పాడేది మిండెడి పాట....అన్నట్లు మా వాళ్ళ గుడ్డ తొడుగుతావ్.... మావాళ్ళ బువ్వ తింటావ్.... మావాళ్ళు కండల్ని కరిగించి వాళ్ళ బొక్కల్ని ఇటుకలుచేసి కట్టిన ఇండ్లో వెచ్చగా వుంటావ్.... పైగా....మా మీద....

బూతు....అసహ్యం వెళ్లకక్కుతావ్ మా వాళ్ళ కష్టజీవులు....సమాజాన్ని అందంగా.... ఆనందంగా తీర్చిదిద్ది.... జీవితానికే కొత్త అర్థానిస్తారు.... చదువులేక గూడులేక గుడ్డ లేక.... కడుపునిండ తిండిలేక.... కటిక పేదరికరంలో బతుకుతున్న వాళ్ళ....వాళ్ళను చూసి ఈసడించుకునే మీరు.... వాళ్ళ గూర్చి బయటి ప్రపంచానికి చాటుతారా...." ఆవేశంతో కదులుతుంది....

"ఎందుకంతకోపం కాస్త నిదానంగా ఆలోచించు" తడబడుతూనే అన్నాను.

"నిదానం.... కళ్ళల్లో పొడిచినా.... కాళ్ళ నరికేసినా.... కడుపుల్లో కసిగాకత్తులు గుచ్చినా నిదానంగా వుండమంటావ్. అయినా దొంగలు పడ్డాంక అర్నెల్లకు కుక్కలు మొరిగినట్లు ఇంత అలస్యంగా వచ్చావేం"....

"నిజమే ఎప్పుడో రావాల్సింది అలస్యం జరిగింది క్షమించు"....

నాడె జీవనాడి స్పందిస్తున్నది.

రవి అస్తమించని సామ్రాజ్యవాదుల పాలనలో మన దేశంలోవున్న ఎంత మంది చేతివృత్తుల వారి చేతులు నరకబడ్డాయో.... ఆ చరిత్ర నీకూతెల్సు.... కుండలు చేసే కుమ్మరి యంత్రఘాతపు ధాటికాగలేక కుమిలిపోలేదా? పవర్ మొగ్గం పరుగు లోన పరుగుపెట్టే సాలీడుపడి నలిగిచావలేదా? బ్లాస్ట్‌ఫర్నెస్ కొలిమిధాటికి కొలిమిపెట్టే కమ్మరన్న కమిలిపోలేదా? సమస్త వృత్తుల సహస్రజీవులు.... స్వేచ్ఛగా బతికేవాళ్ళు యంత్రాలకు బానిసలయ్యారు.... ఇంకా నైజాం రాజ్యంలో వున్నవాళ్ళు.... పై నాగరి కతకు అప్పుడప్పుడే అలవాటు పడుతున్నా.... జమిందార్ల, జాగీరుదారుల పటాటోపం సాగుతున్నది. అది.... వెంకటాపురం.... రాజనర్సింగరావ్.... ఆ హల్కాలో అతని పేరంటే హడల్.... అతని మాటే శాసనం....తిరుగులేదు. గ్రామ శివారులోని మూడు వేల ఎకరాల్లో 2500 ఎకరాలు దొరదేనాయె. మబ్బుల్లో చంద్రునోలె.... అవూళ్లొ అత నిది పెద్ద బంగళా.... చుట్టూ 2 ఎకరాల గడీగోడలు... ఆ లోపల ఏంజరిగినా బయిటి ప్రపంచంలో ప్రాణమున్న ఏ ప్రాణికీ తెలువదు - ఒకవేళ తెల్సిందో? ఆ ప్రాణి ప్రాణం కొల్పోతుంది....కొనుపులు పెట్టినా, కొరడాలతో కొట్టినా, పాతి బొంద పెట్టినా.... ఇంకా ఏంజేసినా? తెలువదు.... తెలువకూడదు.... అన్ని కులాలు వున్నాయి, అన్ని వాడలు వున్నాయి- చాకలి, మంగలి, వడ్ల, కమ్మరి, కంసాలి, కాపు.... మేదరి.... మేర.... జనంవలన తిరస్కృతులు సంఘానికి బహిష్కృతులు.... మాలలు మాదిగలు.... కాని ఆ వూల్లో ఒక్కకులమేలేదు....

ఆ వూళ్లో అందరు....అన్ని కులాలు వున్నప్పటికీ....సాలె....కుటుంబమేలేదు.... ఇదే విషయం రాజసర్సింగారావు ఆలోచించేవాడు.... ఇంతలోనే అతనికి ఎవరో ఈ కబురు జారవేశారు. పక్కవూరిలోని దాసరి రాములు కొడుకు నారాయుడు మంచి నేతగాడు, పిల్లాజెల్లా లేరు.... మంచి సంసారజీవి....దాంబికంలేదు అక్కడ రాములుకు పనిలేదు.... ఉన్నా ఇద్దరి పనిలేదు. వాణ్ని మన వూరికి తన ఊరికి పిలిపించాలను కున్నాడు రాజసర్సింగరావు. అంతే మూడోరోజు నారాయుడు పెళ్లంతోసహా వచ్చాడు "చూడు నారాయా, ఉరిగౌటాన్‌లో గుడిసెవేసుకో బంజర్లో రెండెకరాల భూమి పుట్టల దిబ్బ.... వర్షాకాలం జాలుకు కష్టపడితే పొలమే అవుతుంది. ఈ వూళ్లో వున్నంతకాలం నీవే అవి" అట్లా నారాయుడు ఈ వూళ్లోకి వచ్చాడు.... అతనికి బయిటి ప్రపంచంతో సంబంధం లేదు.... మొగ్గం గుంటకే అంటుకొని ఉండేవాడు. మనిషి కాబట్టి తిండి.... తిప్పల అప్పుడు.... అప్పుడే అతనికి కాస్త విశ్రాంతి....

కాలం గడిచింది.... వాళ్ళకు సంతానం కలగలేదు.... శంకరాన్ని.... తన వదిన కొడుకును దత్తం తెచ్చుకున్నాడు....

ఇవ్వాళ శంకరం ఓటుకెదిగిన బిడ్డడు....

కొనుపులతో కాల్పించిన, కొరడాలతో కొట్టించిన, వెట్టి చేయించుకొని ఎందరి ప్రాణాల్నో మట్టెగలిసిన రాజసర్సింగరావు.... ముసలాడు. ఇప్పుడు గడిలో పెత్తనం రాజగోపాలరావుది.... ఆ తాలుకాలో పెద్ద లీడర్.... నారాయుడి వయస్సుంటుంది.... 45.... బ్లాక్ ప్రెసిడెంట్ ఇంకా ఎన్నో చిన్నపెద్ద హోదాలున్నాయి.... ఎన్ని తప్పినా ఆవూరికీ దండుగల బాధ తప్పలేదు.... వెట్టి తప్పలేదు.... ఆ వూళ్లోనేకాదు — ఆ హల్కాలో కూడా ఎన్నో ఉద్యమాలు.... ఆందోళన్లు రేగాయి.... ఆ ఛాయలకు వెళ్ళలేకపోయాయి.... రాజసర్సింగరావే రానివ్వకుండా కట్టుదిట్టం చేసాడు

వంతుచాకలి రామి దొరకంట్లో పడింది.... అంతే ఈ విషయం తెల్సిన చాకలి నర్సయ్య కసితీరా తిట్టినందుకే అతని ఊపిరి అనంతవాయువుల్లో కల్సింది.... రామి పిచ్చిదయింది. మంగలి రాజం ఏమరుపాటుగా గడ్డంచేస్తూ చిన్నగాటు పెట్టినందుకు అతని మొఖం మీద వాతవేయించాడు.... కాపు కనకయ్య ఎద్దొకటి దొరగట్టుమన మేసి నందుకే ఎడ్లజత గడిలోకచ్చింది....భర్త చనిపోయిన బ్రాహ్మణ సుగుణమ్మ దొరఇంట్లో వంటగత్తె అయ్యింది.... ఆమెను లొంగదీశాడు.... అగ్రహారపు భూమి గుంజాడు లంకంత లోగిలిగల ఇంట్లో పంటదినుసులు పోస్తున్నాడు.... వాటికి అంతంలేదు.... అనంతం.... ఒకటా రెండా కడుపు చించుకుంటే కన్నీరు కాల్వలౌతుంది, మరి రాజ గోపాలరావేం తక్కువతినలేదు.... వర్కర్ రత్నం మాదిగ మదనమ్మ....ఎందరో....

పూళ్లోవాళ్ల పేర్లమీద బ్యాంకులో 5 లక్షల అప్పు.... బ్యాంకు వాళ్ళు రైతుల పైబడి ఆస్తుల్ని జప్తుజేస్తుంటే.... గొడ్డూగోడా అమ్మకట్టారు. భార్యా భర్తల మధ్యన తగువొస్తే లంచం- ఏ పంచాయితీ అయినా ఇక్కడే, ఈచుట్టు పట్ల ఎక్కడయినా అంటే- ఒకటారెండా.... లెక్కలేదు.... ఇక్కడి.... మట్టి.... చెట్టు, పుట్ట గట్టు దేన్ని అడిగినా.... చెప్పుతాయి.... అంతకన్నా సాక్ష్యం ఏం కావాలి....

సరిగ్గా.... ఈ పరిస్థితిలోనే.... ఊర్లు ఏర్లయిపారాయి పల్లెలు పల్లెలా లేవు.... నిశ్శబ్దంగావున్న పల్లెలు నిప్పులుగక్కాయి.... నిన్నటిదాకా బాంచెనోళ్ళు.... బరిగీసి నిల్చిండ్రు మొన్నటిగాయాల గుర్తుల్ని తలపోస్తూ తల్లడిల్లినోళ్ళు తటాలున లేసిండ్రు.... సంబరం.... సంతోషం.... అలజడి.... ఏచోట విన్నా "సంఘం".... ప్రతిపొల్లగాడి నోట్లో పాట....

ఆఁ....గా సంఘపోళ్ళే.... పూళ్లోకి వచ్చిండ్రు ఈ సంఘపోళ్ళు ఎవల్లోగని.... కష్టజీవి కంటిరెప్పలనిపిచ్చిండ్రు దిక్కుమొక్కులేని జనాన్ని ఒక్కటి చేసిండ్రు.... వాళ్ళ శక్తి తెలిపిండ్రు.... ఈ.... ఈ.... దిక్కులేని జనంతోటే చిక్కులేని వలను అల్లిండ్రు.... సాకలి సాయన్నతోటి.... మంగలి మల్లన్నతోటి.... ఒక్కరేమిటి.... సాలేరిమొగ్గం జాలరి వర్గం.... సమస్తజీవుల సహస్రవృత్తులవాళ్ళు.... తుక్కిన పేనోలె ఉన్నోళ్ళు ఉప్పెనయ్యిండ్రు....

ఇంకేముంది.... బంజర్లో ఎర్రజెండాలు ఎగిరాయి.... గౌరన్ భూమిలో గుడిసెలు లేసాయి.... రాజగోపాల్ దొరగారి కుక్కలు.... మొరిగాయి.... కరిచాయి.... కటకటాల్లో వేశాయి.... ఏదైతేనేం దొర సంఘంముందు తలవంచాడు.... చిన్నదొర కుడితిల బడ్డ ఎల్కతీర్గ కొట్టుకున్నాడు.... దొర్నాని.... దొర్నాన్ని సీదరిచ్చుకున్నాడు.... గడీల.... గడ్డి మొల్చింది.... మొల్చిన గడ్డిమీద చిన్నదొర అటుంచిఇటు ఇటుంచి అటు తిరిగితే బాటలుపడ్డయి. సంఘాన్ని నాసినం చేయ్యాలి.... అదే ఆలోచన.... సంఘం ఇవ్వాళ.... రేపు భూములు.... ఎల్లుండి అధికారం.... అమ్మో! ఏమన్నుందా.... వీల్లేదు అలా జరగరాదు సంఘాన్ని దెబ్బతియ్యాలి....

ఆఁ అన్నట్లు శంకర్.... శంకరే దొర కంట్లే వున్నడు. సంఘపోళ్ళ దెచ్చింది ఈయనే అందుకే దొర కన్ను.... సూర్యునోలే మేల్కొన్న జనం.... చండ్రనిప్పులు చెరిగిండ్రు న్యాయంగా రావాల్సిన దాన్ని అడిగిండ్రు-చెవులు పిండిమరీ వసూలుజేసిండ్రు

పనులు బంద్ - సాకలి బంద్.... మంగలి బంద్.... జీతగాళ్ళ బంద్....బంద్ బంద్.... అన్నీ బంద్.... వెలేసి పారేసిండ్రు దొరను.... కల్లోలం.... ఇంకేముంది.... పల్లెల్లో కాకి బట్టల కవాతు....

కుట్ర.... గాడా దొర చేను కాడా కుట్ర జరిగింది....ముంతెడు కల్లుపోయించి.... దొప్పెడు కూరిచ్చి....భూములు ఇప్పిస్తానని కొందర్ని ఉసికొల్పిండు....

సూర్యుని మీద కుట్ర

గాలి మీద కుట్ర

ప్రజాశక్తి మీద కుట్ర....

కత్తులు, గొడ్డళ్ళ, కట్టెలు.... నారాయుడు దెబ్బలకు చనిపోయాడు లచ్చవ్వ చెయ్యి విరిగింది.... మొగంమీద పడుగుకోశారు.... రాట్నం విరిగింది.... పందిరి కూలింది.... ఎందుకు ఇదిగేటన భూమి.... అని.... మాల మాదిగలకే నీక్కాదు అని.... ఆ పూట శంకర్ లేడు ఆయిన పక్కవూళ్లోకి పనిమీద పోయిండు.

సంఘం ఏంచేసింది.... కుల, మత భేదంలేదు.... కష్టించే ప్రతివానికీ హక్కువుంది.... గౌటన్ మీద.... కాని మొగ్గం గుంట దోసిగానే వుంటుంది.... రాట్నం తిరగడంలేదు.... నారాయుడి లచ్చవ్వల ఊపిరిగా పెరిగిన శంకర్ లేడు అయినా లచ్చవ్వకు తృప్తి, తన ఊపిరిగా పెరిగిన కొడుకు పాడి ఊపిరితో ఊది ఊది పండిస్తున్నాడు.... అదేసాలు.

నీలమ్మ నీ మొగడు నిన్నేలుకోడే

ఏలకుంటే మానె ఏమకుంటె చాలు

నీలమ్మ నీ మొగడు నిను సాకాలేడే

సాకకుంటే మానే సల్లగుంటే సాలు అని శంకర్, భార్య ఊసులాడుకున్నారు శంకర్.... లేడు.... ఊపిరిపోస్తున్నాడు.

× × × ×

కల్లోలం చీకట్లో రోజూ పల్లె మూల్గుతూనేవుంది.... పిట్ట పీచుమనదు.... చీమ చిటుక్కుమనదు.... అర్ధరాత్రి గాడుపు సన్నీలను కోస్తుంది.... సన్నే గాడుపునుకొయ్యాలనుకుంటుంది.

వీధి మూల్గుతుంది బరువు మోయలేక....

కుక్కల మొరుగుడు.. ఎముకలు విరిగిన చప్పుడు

రక్తం కారిన శబ్దం..

అజ్ఞాత వ్యక్తుల కోసం—ఇంటి చూర్లకు గబ్బిలాల్లా వేళ్ళాట.... రాత్రింతా

మళ్ళీ సూర్యోదయం....

మళ్ళీ రాత్రి.... ఇట్లాగే సాగదు.... ఈ దారుణాలకు గోరీకట్టాలి....అందుకే.... గోదారితీరమ్మీద గుడారాన్ని ఎత్తుతున్నాడు శంకర్....శంకర్ ఎప్పుడుకలిసినా చెప్పు.... నాదెలాగే.... నువ్వూ జనంగుండెల్లో ఎప్పుడూ కదలాలని.... కన్నీరు పెట్టుకోవద్దని.... నాకన్నీట గుర్తుగా చెప్పు.

కథ :

# కిరాయి బతుకులు

కే ఆర్కే

పొద్దు పనుమటి గుట్టల్లకు జారుతంది. సెర్లల సాపపిల్లలు మీనికచ్చి బుగ్గ లిచ్చి లోనికిపోతన్నయ్. తాల్లల్లకెల్లి గాలి బొయ్యున అత్తంది. గౌండ్లల్లు కావల్లకు కల్లుకుండలు తలిగిచ్చుకొని పోతండ్రు. మొగులల్లా సిలకలు కీసు కీసు మంటన్నయ్. అకాసముల తెల్లకొంగలు లైసుకట్టినట్టు గొలుసు లెక్కన్నె పోతన్నయ్. పూరేడు పిట్టలు కంచెలల్ల పొదుగుతున్నయ్.

పోశమ్మ గడ్డకాడి కంచెల రాజిగాడు బక్కెడ్లను మేపుతండు. ఎల్లదాని డొక్క నిండింది. ఇంకా పయ్యది గుంజుక తింటంది. ఎవలన్నాసూసి దొరతోని సెప్పుతరు అనుకున్నాడు భయపడుకుంటా రాజిగాడు. ఎడ్లను తోలుకొని బజాట్లపడ్డడు జర సేపు అగినంక. అయిలల్లాకెల్లి అత్తున్న రాజిగానికి పొయిలకట్టెలు యాదికచ్చి దొనుగు పబ్బపీకిండు. ఇంకో అడుగు ముంగటికేసి ముండ్లపబ్బ ఇగ్గిండు. రెండు పబ్బలను సేతులపట్టుకొని ఉంగుటంతెగిన సెప్పును యెగీసుకుంటా ఎడ్లను యింటికి కొట్టుకచ్చి కట్టేసిండు. నీళ్ళు తాగినంక రాజిగాడు అంచెలల్ల సెలకపిండి పెట్టిండు. గప్పుడు గుండయ్యసావుకారి అచ్చిండు.

"రాజిగా! కిరాయి బండి కడ్తవురా?" అన్నడు గుండయ్య. "అదె బాంచెను ఎందుకు కట్టా" "ఎవ్వలుపైసలిత్తె అల్లకేకడ్తి నాదేమున్నది" అన్నడు బొత్త రాజిగాడు.

"ఎంతకు కొన్నవురా ఈ బక్కెడ్లను" అన్నడు కోపటి గుండయ్య బక్కెడ్లను సూసుకుంటా.

ఏదో బాంచెను మొన్నటి ఆరం ఏదులాపురం అంగట్ల దున్నపోతులమ్మి కొన్న కాదు అన్నడు రాజిగాడు.

గాటి పైసలే సాలినాయిరా? ఏన్నన్నా సంపాయించినావా? అన్నడు గుండయ్య.

"ఆటి పైసలు సాలకుంటె మా సడ్డకుడు అంగట్ల కలిత్తె ఎను దైరుపాలు అడిగి కట్టిన" అన్నడు బొత్త రాజిగాడు. సావుకారి తల గోక్కున్నడు. జరసేపు రాజిగాని బతుకు గురించే పత్తాయించుకొన్నడు. మొదట్ల ఎంకట్‌రెడ్డికి పాలేరుండె, అటెన్క ఊర బర్లకాసిండు. అట్లిట్ల బండికొనె, కొనకు కిరాయికట్టపట్టె నీయవ్వా ఈడుసుత ఇంతింత మీనికేపోతండు అనుకున్నడు నొస్లెపుల్ల కిందగీక్కుంటా గుండయ్య.

"రాజిగా నీకేందిరో దున్నపోతులుపోయి ఎడ్లచ్చె, ఇగ రేపో, మాపో భూమి కొంటవు, ఎవుసంపెడ్తవు, గింతల నీకొడుకు యెదుగుతడు, మంచిగా ఆసరైతడు" అన్నడు కోమటి గుండయ్య బుద్ధిపోనియ్యకుండా.

"ఏదో సావుకారి నీ నోటివాక్యాన గట్లఅయితే మంచిగా బతుకమా, మీ దయ బుండాలేగాని మాఅసొంటల్లకు ఎవ్వడుకావలె" అన్నడు రాజిగాడు.

"అదెరో బండికడ్తె మంచిగా పైసలత్తయ్, పైకిఅత్తవు" అన్నడు గుండయ్య, మాటలో మాట కలుపుడు.

"అందరు కండ్ల కానుతరా సావుకారి. కిరాయి రట్టుమనిరి, ఏదో ఆశకు కిరాయికడ్తి, పైసలు అడుగబోతే రేపనిరి, మాపనిరి. గట్టిగడుగుతె గల్లపట్టికొట్టిరి. మీనికేలి తిట్లాయే" అన్నడు రాజిగాడు కిరాయిపైసలు అడుగపోయిన జగడం యాజ్జేసుకొని నజారుగా.

"ఇగోరాజిగా ! మందిముచ్చెట్లు మనకేమి పెడ్తయికని నువ్వ సరాంది జక్కాడు నాత్రికి తిన్నంక బండ్లుకట్టాలే" అని రెండు బయానగా సేతుల మీనికేలి యేసిండు గుండయ్య సావుకారి ముట్టుడుకొకుండా.

యిచ్చిన రెండురూపాలు తీసుకొని నడికట్టు సెక్కుకున్నడు బొత్తరాజిగాడు.

గుండయ్య బాటనడిసినంక యింట్లకచ్చిండు. ముసల్ది కనబడ్లే, ఎటన్నా కైకిలు పోవచ్చు అనుకున్నడు మల్లా ఆకిట్లకచ్చిండు. కొడుకు కొమురయ్య గద్దెమోపు అరుగుమీన దించుతండు.

"అవ్వేది బిడ్డా ?" అన్నడు రాజిగాడు కొడుకును పిలుసుకుంటా.

"ఆ, అదెందో పెద్దమావకు బాయిల పెల్లకూలి రెక్కిర్గిందట బొత్తల పదికుట్లు సుత యేసిండ్రట. రామగుండంకేలి మనిషచ్చి సెప్పితె ఏడ్సుకుంటా పోయింది గజ్జెల లింగన్నతోని" అన్నడు కొమురయ్య.

ఓరీ నీయవ్వా ! ఎంతపనిజర్గె "అట్టబొక్కలకు కొండ్రిగాడు దెబ్బలు పడ్డట్టు" బాయిల పనంచేపాయే, పోయెటప్పుడు రెండుఏయిలు లంచముపెట్టి. ఎవ్వని పేరు మీననో నౌకరిసేత్తండు అంటె సంబురపడ్తిమి వాడన్న దీపమనుకుంటి, మల్లా సీకటిదిక్కాయె. ఆనికి అడన్నా బతుకుతడనుకుంటి గిట్ల కర్మంజాలకపాయే. ఈనన్న పాలేరున్నా బతుకకపోవునా. అనుకున్నడు ఆకిట్లో నజారు కుసోని.

నాపెండ్లి అయినేడు సిన్నపోరడే గోగురెప్పలెక్క పెర్గిండు. ఇద్దరుపోరగండ్లు ఆయే ఆనికి.అళ్లు ఎట్లబతుకుతరో ఏందో అనుకున్నడు. పోరగండ్లు యెదిగినంక ఒకయ్య

సేతులపెట్టి కాళ్ళుసెయ్యి పట్టుకుంటె గట్లన్నా బతుకకపోతరా అనుకున్నడు అచ్చిన సొదను మింగుకుంటా.

యింకెన్క అంకూసుగాడు అగ్గికని అచ్చిండు- రాజిగానిమొకం సూసిండు- "ఏందిరా సిన్నపోయినవ్" అన్నడు మోకాల్లమీన సేయిలేసి.

బొత్త రాజిగాడు సప్పుడుసెయ్యలేదు- ఏడ్తుండు. కొముర య్య అన్ని సెప్పిండు.

"యెహె - గీదీనికి రందిపడ్తున్నవ్, అదిపెద్ద బత్తారేనాయే.... దవఖాండ్లు లెవ్వా" అన్నడు దేవునీ అంకూసుగాడు.

కొమురడు కుండగోకి యెసరుపెట్టిండు- జెప్పన్నె మంటపెట్టి గడుకరుద్దిండు- ఉమ్మగిలపడ్డంక మూతేసి బయటికచ్చిండు-

"అయ్యా ఏమేసుకతిందామే".... అన్నడు కొంరయ్య

ఏదో ఏదన్నా సూడరాదు బిడ్డా.... అవ్వంటె ఏదన్నా సేసు కని, యాడ ఏదుందో నాకేమి యెరక.... ఇంత సింతపండు తొక్కు నూరు....అన్నడు రాజిగాడు.

దీపం ముట్టించి సూత్తే గాజపొంటి కుండ సింతపండు దొరికింది. నిరుపకొలు రొట్లేసి తొక్కునూరిండు కొంరడు. కంచాలు కడిగి గడుకేసుకున్నరు. రాజిగాడు కుండల నీల్లు సేదుకచ్చిండు.

కొడుక్కు గడుక తినుకుంటనే సెప్పిండు రాజిగాడు.

"గీ నాత్రికి బండ్లు కట్టుక పోతన్నమ్ సేదులాపురం"

"ఎవ్వలకే" అన్నడు కొంరడు.

"గుండయ్య సావుకారికి," తిన్నంక సెప్పులు తొడుక్కొని, బాడి జోళ్ళ సేత పట్టుకొని ఎడ్లకాడికిపోయి ఇడిసిండు.

"ఇంటికాడ జెరపయిలం బిడ్డా" అన్నడు బండికట్టి సావుకారింటికి పోవుకుంట రాజిగాడు.

"ఆ...." అన్నడు కొంరడు

అయ్య పోయినంక రాయపోశడు.... కొంరడు మంచమేసుకొని గుడిసెకు తలుపేసుకొని, గొల్లెంపెట్టి పండుకున్నడు.

.... .... .... ....

కర్రెజక్కడు, రాజిగాడు సావుకారి అర్రిలకెల్లి వడ్లబత్తాలుతెచ్చి బండ్లు నింపిండ్రు.... జక్కని బండి జెర జెర కిర కిర సప్పుడు సేసింది. సడిలి ఆసుతా లేదు కాదురా అన్నడు జక్కన్న....రాజిగాని బండ్లె పది, పదిహేను బత్తాలుమెదిగిండ్రు.

బండ్లు కదిలినయ్. గప్పుడు నాత్రి పది కొట్టిండ్రు. ఆడల్ల సప్పుడు లేదు. పెద్ద ఆడల పడుసుపోరగాండ్ల భజనేత్తండ్రు. పెండ్లీలు అయిన ఆడోల్లు, పొద్దుగాల అత్తలతోని మాటరాకుంటా పొద్దటికి గడుకిసురుతండ్రు పాటలు పాడుకుంటా. ముసలోల్లు కొందరు గురకపెట్టిండ్రు. ఎఱ్ఱగా కాలినసుట్టను తాక్తుంటా, మజ్జిన ఊంచుకుంటా అత్తండు మొలతనం సేసే సెందురయ్య.

ఎడ్లతోకిరుసుకుంటా, వారుకట్టెతోని జీ... అన్నడు జక్కడు- వూరుదాటినంకా జక్కని బండ్లెకెల్లి రాజిగానిబండ్లెకచ్చిండు సావుకారి గుండయ్య- సెప్పులపొంటి సల్లంగా ఇగంకొడుతంది- గప్పుడు సినిగిన తువ్వాలను నెత్తికిసుట్టుకున్నడు రాజిగాడు.

"సావుకారి సలిబెడ్తంది- ఒక్కబీడిసూడు" అన్నడు రాజిగాడు.

అగ్గిపెట్టె, బీడిముక్క యిచ్చిండు రెక్కసాపి.... గుండయ్య సావుకారి.

రాజిగాడు పుల్లనుగీకిండు మెరపుమెరిసినట్టు ముట్టించుకున్నంక, నోట్లెపెట్టుకొని పీల్తండు.

గుండయ్య సావుకారిసుత అబెన్క అగ్గిపుల్లగీకి బీడి అంటుపెట్టుకున్నడు- అచ్చిరాంది ఊరుగురించే మాట్లాడుతండు.

"జక్కా.... మొన్న నెలసెక్కరి తెచ్చుకున్నావురా" అన్నడు గుండయ్య.

"తెచ్చుకోలే బాంచెను".... అన్నడు జక్కడు.

"అదెరా".... అన్నడు సావుకారి.

"ఊల్లె బడిగురుంచో మరి సుట్టు గోడకోసట.... పెద్దసారు మన రమణయ్య సారు గిట్ల అచ్చి అడుగుతె మా మాదిగోల్ల కారట్లు అన్ని యిచ్చినమ్".... అన్నడు జక్కడు.

"గా సెక్కరిత్తె ఏం మొదలైద్దిరా.... ముచ్చటగని.... యింటికిన్ని పైసలు అసూల్ సెయ్యాలె.... ఓ మూటయేయిలు అయితె సర్కారోల్లు తొమ్మిది యెయిలిత్తరు కని.... గీ మూడు ముద్దాల పనికీ...." అన్నడు గుండయ్య సావుకారి.

రాజిగాడు మూలతిరుగుడుకాడ పగ్గాలిగ్గిపట్టి ఎడ్లను తోకిరుసుకుంటా బాటకు పొడిసిండు....

"గీనెలంటె బడికిపాయె...." "మరి గా పోయిన మూన్నెల్లు?" అన్నడు.... రాజిగాడు మాట కలుపుకుంటా.

"గా మూన్నెల్ల సెక్కరతోని రెడ్లంతకలిసి లొల్లిపెట్టుకొన్నరు....నాకెక్కవంటె నాకన్నరు.... గా మాల మాదుగులు ఇంతకనం తాగుతారా? అన్నడట లింగారెడ్డి.

పట్వారి మన అయిదూల్లపేరట ముప్పైకిలోలు అడిగే నాయబ్ తాసిల్దారు సంతకము సెయ్యాలంటె ఇరవైకిలోలు అడిగె.... గివన్ని సూసుకొని డీలర్ల కిత్తండుర్రి- డీలరింత- మొగ్గుకొట్టి ఉన్నదిత్తండు...." అన్నడు కోమటి గుండయ్య. రాజిగాడు ఊకొడుతండు.

"అట్లనా సావుకారి" అన్నడు బిరిపోయినట్టు జక్కడు.... రాజిగాడు "మీరు ఎప్పుకున్నరా సావుకారి" అన్నడు.

"ఏందిరో నాదిపోనిత్తనారా! నాకు మూడుకిలోలత్తది. కిలా ఇంట్లకైన, రెండుకిలలు అమ్మితె తొమ్మిది, తొమ్మిదిఅత్తయ్. అసలుపైసలు మిగులుతయ్" అన్నడు సావుకారి లాబపడ్డట్టు.

"ఇగో సావుకారి మనూర్లె కోపన్లమీన గోధుమలు, గాంచునూనె, బియ్యం సరింగా అత్తలేవు.... ఎందుకన్నట్టు" అన్నడు జక్కడు.

యొహె.... మన పక్కపొంటి ఊర్లెరాంగా.... గీదా గంతాగట్టోడు ఉన్నడా? అన్నడు రాజిగాడు.

జక్క.... ఇగో ఉద్దెరవారమంటె గడ్లెపన్నోడు లేసత్తడు. ఊర్లెకు సెక్క-రంటె తెత్తండుర్రి- ఇగ గోదుమలు గాంచునూనె అంటే.... ఎదులాపురంల అమ్మిక పెం.... తండుర్రి అన్నడు గుండయ్య.

గట్లెందుకు సేత్తండుర్రి అని అనంతరెడ్డి అడుగుతె కొట్టిండుర్రి....మొన్నటి దాక దావఖాండ్లనే వుండే.... అన్నడు జక్కడు. మాదిగోల్ల పేరెట్ల సెక్కరికోట రావల్నని కన్నెసగురంపోయి దనుకాసు పెట్టబోతే కరకోటి ఎల్లడు.... అడుసుత రెడ్ల తోని రండాయే ... అన్నడు పల్ల గుండయ్య.

"యొహో....మనూరికతే తప్పింది ధర్మరెడ్డి సచ్చినకానుంచి" అన్నడురాజిగాడు.

వారీ.... నాయకుడ్లని తండరెక్కనె వుంటంది మనూరు అన్నడు జక్కడు- రాజిగాన్ని కొడుకువరసతోటి.

ఉన్నసర్పంచి ఊరునే పట్టించుకోకపాయే.... కుక్కదాయిల పడ్డదని బిలాకుల అయిదుమేయిలు తెచ్చుకతినె- గది గట్లపోయినిగని- సపాయోల్లపైసలుగూడ తినబట్టె, అక్క అందరున్నరని పారముల రాయవట్టె అన్నడు రాజిగాడు. గా మస్జిద వుల్లెకు బస్సత్తె దెవరునుకొట్టిర్రి, రెడ్లు అక్క ఇంటికాన్నే బస్సులాపుమనిరి. గిప్పుడుబస్సుల్లేక యెంత తిప్పలైతందోసూడు అన్నడు గుండయ్య.

మాటలు ఇంకా జోరుగా నడుస్తున్నయ్.... ఎడ్లు మడికట్టుదాటి మోరిదగ్గరికి అచ్చినయ్. నన్నాయ్‌పల్లె దొర యింటిముంగట లైట్ తేజుగా మెలుగుతంది. గా దాని సుట్టు మిడుతలు ఎగురుతన్నయి.

బండ్లు ఊరుదాటినయ్.... సీకట్ల మర్లనీడ కయిసీకటి లెక్కున్న వున్నది. అటి పూడలు సొప్పగూడు పెట్టినట్టుగున్నయ్.... గా మర్ల కిందికి బోయినంక సుట్టముక్క కోసం సావుకారిని పిలిసిండు జక్కడు. మాట్లాడుతన్న రాజిగాడి మాటలె యింటడు సావుకారి. గా జక్కని మాట ఇన్లేదు.

మల్ల జెర గట్టిగా పిలిసిండు.... జక్కడు.

ఆ.... ఏందిరా.... అన్నడు గుండయ్యసావుకారి. ఒక్క బీడీ ఉంటెసూడు.... అన్నడు జక్కడు.

జేబులకెల్లి పోటువ బీడితీసి ఇచ్చిండు.... సావుకారి. ఆకాసంల సూసిండు. "గోటుకోలు" గూకినయ్. జక్కడు బండాపి బీడి ముట్టించుకున్నడు.... మల్ల బండ్లు కదిలినయ్.... రాజిగాని బండికి జనుము అరిగింది. బండి 'కిరు కిరు' మంటంది. ఇంకా ఎదులాపురం మైలున్నరనే వున్నది. లైనుగీసినట్టుగా లైట్లు తేజ్‌గా కనపడు తన్నయ్. జక్కడు పాట పత్తాయించుకొన్నడు. మొదుగాలు నోట్లెనేపాడుకున్నడు. అటెన్క జర గట్టిగనే పాడిండు ... గిప్పుడు బండ్లమీని పాటయాది కచ్చింది....

ఆపవు మల్లయ్యో
బండిమీన నేనత్త
పల్లెలో పటేండ్లు
కండ్లెపెట్టుకుంటండ్రు
కాటిక పోడరేత్తె
కండ్లెపడితె వోనియ్యరు ॥ఆప॥

సావుకారి గుండయ్య పాటిన్నడు- జక్కడు మంచిపాటే పాడుతండు అన్నడు. నల్గురు పుట్టినా ఇంకా సోకుపోలేదు అన్నడు.

'ఆనికేంది రంజా రవుకా' అన్నడు రాజిగాడు గాపాట సీకట్ల ఎంతో దూరం యినవోయింది. ఎన్నో సెట్లను దాటేసింది. కాలువ దాటినంకా పగ్గాలుఇడ్సి ఎడ్లను పొడిసిండ్రు.... ఎదులాపురం పొలిమేర్లకు అచ్చిండ్రు.

బండి యాడాపుతాం సావుకారి అన్నడు రాజిగాడు ఎడ్లతోక లిరుసుకుంటా జే....అని.

లారీ ఆఫీస్‌కాడ అన్నడు సావుకారి ఆఫీసురోడు సూపించి.

లారీ ఆఫీసుకాడ బండ్లు ఆగినయ్. గా ఆఫీసు ముంగట పెద్ద పెద్ద లైట్లు యెలుగుతన్నయ్. ఆఫీసులోపట దేవుండ్ల పోటువలసుట్టు సిన్న సిన్న లైట్లుయేసిండ్రు. అయి మినుకు మినుకు మంటన్నయ్. అమాలోల్లు యింకా బత్తాలు మోత్తండ్రు. బత్తాలు రూముల్లకెల్లి తెచ్చి లారీల నింపుతండ్రు. ఆల్లపెయికి అంగిపేల్క సుతలేదు. నెత్తులకు మూరడంత పేల్గలు సుట్టుకున్నరు. అల్ల పెయిలమీన రొట్టెపెనం లెక్కన్నె కాయలుకాసినయ్. నడెన్నుమీన అరసెయ్యంత ఎలుపుతోని కాయకాసింది.

అమాలీ కొంరడు బీడిపీల్తండు. లారీఆఫీస్ వోసరు గురకుపెట్టిండు గల్లపెట్టె దగ్గర్నె. పద్దులురాసి లగీజ్ సిట్టీలురాసే రాంబాబు ఏదో వయి సదువుతండు. గప్పుడు గుండయ్య సావుకారి రాంబాబును కలిసిండు. బత్తాలు గిన్ని, రేప్పొద్దున్నే లారికిపంపియ్. రేపు బీటికి అందెటట్టుసూడు అన్నడు- గుండయ్య సావుకారి మాట మీనికేలి సిట్టీలురాసి కాయితాలుసింపి ఇచ్చిండు.

రాంబాబు సెప్పినట్లు అమాలోల్లు బండ్లల్లకెల్లి బత్తాలుతెచ్చి సంబర్లుయేసిండ్రు.

సూసినావురా జక్కా.... గాల్ల లెక్కన మనం యెన్నుమీన మోత్తాంరాబత్తాలు అన్నడు రాజిగాడు. అబ్బో మనకేమి సాతనైద్దిరా ఆల్లు సెయ్యిల్లేత్తె బత్తాల్లేసి ఉరుకతయ్.... అన్నడు జక్కడు.

పాపం నిదురసంపుకొని నాత్రిసుత సేత్తండ్రు- అల్లకు రోజు లెక్కన్నె కట్టిత్తరో- నెలలెక్కన్నె కట్టిత్తరో అన్నడు రాజిగాడు

నీయవ్వా.... మనంగుడ నిదురసంపుకొని రాలేదా పైసలాసకు గీనాత్రిసుత బండ్లుకడ్తిమి- ఊర్లుదాటి, యిద్దరం మనసులము, బండ్లు, ఎడ్లు మనకాపాటచ్చిందు మా.... అంబె రెండురూపాలేనాయె పదికాడ.... అన్నడు జక్కడు.

అమాలీ దుర్గన్న బత్తాలు యేసుడైసంకా జక్కనిమొకం సూసుకుంటా ఏవూరు బండ్లు బాంచెను ? అన్నడు.

గల్లెందుకంటవే బాంచెనని గంతగనం పెద్దోల్లమా.... మేముసుత నీలసొం టోల్లమే- అన్నడు రాజిగాడు జాలిగా.

నీ పేరేందన్న ? అన్నడు జక్కడు- నాపేరు దుర్గయ్యే అన్నడు దుర్గయ్య.

ఇగో దుర్గన్న గీనాత్రిసేత్తె ఎంతిత్తరే అన్నడు జక్కడు.

ఏమ్‌చెప్పాల్నే.... గీ బత్తూరి బతుకులు సెప్పితే మా మానమేపోతది అన్నడు దుర్గన్న.

యింటింటికి మంటిపొయ్యేనాయే.... అందరం గట్లైనేవుంటిమి సెప్పరాదే అన్నడు జక్కడు.

ఏమ్‌జెయ్యాల్నే.... నాగోస దేవునికి ముడతందో లేదోకని నాకో నల్గురు బుచ్చాలు పెట్టె- పొద్దంతసేత్తి, నాత్రింతాసేత్తి, ఎంతసేత్తె ఏమున్నదే ఆకర్కి బట్టకు కట్టమాయే.... పొట్టకు కట్టమాయే.... అన్నడు దుర్గన్న.

"ఏహె....గా దేవుడున్నంక గీ బాదలెక్కడియే- మనం సత్తెగిట్ల తీరుతయ్" అన్నడు రాజిగాడు మాటకలుపుకుంటా.

"అసలు కూలెంత గిడుతదో సెప్పరాదే" అన్నడు జక్కడు .... మల్ల మల్ల అడుక్కుంటా.

"ఏంజెప్పితే ఏం లాభమే.... గీ కాలంల రోజు అరు కట్టిత్తరు.... గీ సిటీల అచ్చినయ్ సిల్లరఖర్సులకే సాలయాయే.... మల్ల రోజు రోజు రెండో మూడో అప్పె కావట్టె.... ఇగ సుట్టపోడుఅత్తె ఇగ పది ఒడిసినయనుకో...." అన్నడు దుర్గన్న.

"మరి నీ కొడుకును ఏపనికింద బెట్టినవే...." అన్నడు రాజిగాడు.

"ఆడు వోటల్ల పనిజేత్తండు.... తిండిపెట్టి ఓ ఇరువైరుపాలిత్తరు.... బట్టున్న సిల్లరకర్సు మనదే" అన్నడు దుర్గన్న....

మరి మీవూల్లో భూమి లేదానే.... గింత దూరమచ్చి గిన్నిబాదలు పడుడేంది.... అన్నడు జక్కడు.

మా అవ్వయ్య సంపాయించింది రెండెకురాలు మాగుండేగని.... నా పెండ్లప్పుడు.... మా అయ్య దొరకు గిర్వపెట్టి ఎయ్యిరూపాలుతెత్తె అడ్డికట్టక....అసలు కిందనే.... ఆటిని సూసుకున్నడు.... అన్నడు దుర్గన్న.

ఇగ వూల్లె ఏమాసరలేదానే.... అన్నడు జక్కడు "ఇగేమాసరుందే.... ఒక్క గుడిసున్నది.... దానికోసంపోతె అడు మెలోల్ల తోలి బాకి కట్టుమంటడు, గా పల్లె లిడిసి గీపట్నంమత్తె మల్ల ఉన్నోల్ల సేతికింద నల్గులంకాబడ్తిమి"-అన్నడు దుర్గన్న.

మరి ఏమన్నా అడ్డుమాస్.... ఇయ్యారానే అన్నడు జక్కడు.

గీ ఈపంతా కాయగాత్తే....సెయ్యంగ ఆరానికి కూలిచ్చె.... అదిరెండు మూడు దినాలైనంకా ఇగ అడు అడ్డుమాస్ ఇత్తాడు అన్నడు దుర్గన్న.

"అమాలోల్లుఅందరు కట్టుఅయి కూలీ పెంచుకుంటేకాదా.... అన్నడు రాజిగాడు.

"గా యాడాదికింద గట్లనే సేసినంకని, ఎవ్వడు కట్టు నిలవలె.... మల్లా ముంగటపడ్డోడు కంటుఅయిండు" దుర్గన్న.

తెలిసినోళ్లు ఊరికిద్దరు ముగ్గురుంటే కంప్లైపెట్టుకుంటరు.... అట్లసుత తెగిచ్చి కొని ముంగటనడిత్తె, నల్గురికి కావల్సిన పనులుసేత్తె నలుగురుకల్సి సరకవట్రి.... అన్నడు జక్కడు.

గిది అన్నాయం.... గయినను అట్టిగా సావకొట్టిండ్రు- అని పేషస్ల దరుకాసిత్తె లంచముతీసుకొని కేసు కొట్టెయ్యవట్టె- డబ్బుండి ఎన్ని పనులుసేసిన సెల్లుతయ్ అన్నడు దుర్గన్న.

మల్లకొందరేమో గాచారముసాలక మన బొమ్మకంట్ల తిరుపతిరెడ్డి లెక్కన్నె సావవట్రి అన్నడు జక్కయ్య ఆయిన సావుగురుతుకచ్చి.

గయినె వున్నప్పుడు ఎన్నిపనులు సేసిండో సేసిండు- అన్నివూల్లలకు తెలుసు గయినసేసిన పనులు బస్సులగురించైతె, ఇండ్లకోసరము, ఊల్లె ధర్మబాయిలగురించైతె సానకట్టపడి సేపించిండు- గిప్పుడు అందరు గురుతుసేత్తుండ్రు అన్నడు బొత్త రాజిగాడు.

"నీయవ్వా.... గీసిటీల బాడుకావ్లైతె అంగుతే మాయంసేత్తరు- పత్తు పల్లెటూర్లనె ముంచుతడు- ఓసారైతె కిలానూనెకు పదికాడ పదిహేనన్నడు- మీదికెల్లి 'ధరపెర్గింది నకురాలు సేత్తన్నవా? అన్నడు' నకండ్లుసూడంగా గంతపెంచి తీసుకున్నడు" అన్నడు దుర్గన్న.

ఇగ పల్లెటూరోల్లు ఎవ్వల్లె? నువ్వుగమ్మతె మాట్లాడుతవ్- నీఅసొంటిన్ని నాఅసోంటిన్ని సకులం ముంచుతరు అన్నడు జక్కడు.

మరీ.... పట్నపోల్లను ఆడుముంచడు- అల్లుతెలివితోనుంటరని ఆనికితెలువదా అన్నడు పక్కకు బండిడిసిన కొత్తమనిషి.

పతాకం సిల్లరోల్లనుకొట్టి పెద్దయితండుకాదు- అన్నడు కొత్తమనిషిపొంటివున్న ముసలాయన సుట్టతాక్కుంటా.

మన సిల్లరోల్లు గిట్లసూసుకుంటా వూకుంటే ఆడు ఆకీరీలా బాయిల్ల నూకుతరు అన్నడు దుర్గన్న.

ఈల్లమాటలు జోరుగ నడుత్తున్నయ్.

సలికి అనుకుడుబెట్టి అందరు సుట్టలు ముట్టించుకున్నరు- మజ్జెన కొండ్రికిచ్చి వూంచుతండు, ముసలోని సుట్ట సగంకాలింది- అటెన్క కొరికి ఉమ్మితడిపెట్టి నుసి సులిపిండు- మల ఎడమసెవ్వుకు సెక్కిండు.

రాంబాబు అమాలీ దుగ్గన్నను పిలిసిండు దుర్గన్న లేసిపోయిండు.

లారీల బత్తాలుఏసి కట్టుకట్టుండ్రి.... కమలాపురంలసుత ఇంకో ఇరువై బత్తాలున్నయట గిప్పుడే పోనచ్చింది అన్నడు రాంబాబు.

సూత్తిమనెటాల్లకు లారీల బత్తాలు నింపిండ్రు- కొబ్బరితాల్లతోని ఇగ్గికట్టిండ్లు- డేవరు రాములు లారీని గుర గుర సప్పుడుసేసిండు- పాం.... పాం.... అని అద్దం ముంగటి బుగ్గనువొత్తిండు.

లారీసప్పుడుకు ఎడ్లు బెదిరినయ్- రాజిగాడు పగ్గాలుపట్టుకొని ఎడ్లముంగట నిలబడ్డడు.

లారికదిలింది.... కమలాపురం.

ఇంకా నిదురపొద్దుంది- నాత్రి మోటలుకొట్టుయాల్లఅయింది- ఇగ రేపో మాపో అమాసరావచ్చు అనుకున్నడు పెందురున్నిసూసి జక్కడు.

ఈల్ల బండ్లకాడికి సావుకారచ్చిండు- ఇగ ఇంటికిపోండ్లి అన్నడు.

మరిపైసలో సావుకారి అన్నడు జక్కడు. ఇగ మంచిగనే వున్నది కత సూసుకుంటా మాట్లాడుతవేందిరా జక్కా అన్నడు కోమటిగుండయ్య.

గిప్పుడు లారీపోతంది. రేపొద్దుగాల బీక్లే అమ్ముకొని మీకు పైసలిత్త విడ్డా- అంతకనం మీ సొమ్ము ఎగబెడతానా.... యాడికిపోతయ్.... మీ కీసలల్లా వున్నట్టె అనుకొండ్రి అన్నడు గుండయ్య.

ఉపాయంకొద్ది బండ్ల సాగనంపిండు, గానాత్రి బండ్లు రోడుదాటి, రాగాలల్లకెల్లి ఇండ్లు సేరేటాల్లకు తెల్లారుతంది. పిట్టలు కిచ కిచ మంటున్నయ్. తూరుపు మబ్బు ఎర్రగా కన్పడతంది.

.... .... .... ....

రెండుదినాలైనంక గుండయ్య సావుకారి ఊరు సేరచ్చిండు. బీక్లెకు వడ్లు కొంచపోయిన సంచులుసుత కట్టకట్టుకచ్చిండు. తీసుకచ్చిన పైసలుసుత సావుకారమ్మకు ఇచ్చిండు. అవెనక జాలట్లకుపోయి కాళ్ళ రెక్కలు కడుక్కున్నడు. గప్పుడు ఇంట్లకచ్చిండు.

సావుకారింట్ల లాంపు యెలుగుతంది. గా లాంపుకు తాడుకట్టి మీన గుంజకు

రెండుయెయిల సిల్లరున్నయ్. పైసలు సందుగలపెట్టి తాళంపెట్టిండు- గింతతిని నిదురపోయిండు.

తెల్లారినంక బొత్తరాజిగాడు, కర్రెజక్కడు పైసలకచ్చిండ్రు.

ఏమాయే- బాంచను గా పైసలు జెప్పకబోతిరి అన్నడు రాజిగాడు,

రాజిగా! పట్నంపోయి పంది పి....తిన్నట్టుగున్నది కత....అన్నడు సావుకారి.

అదేసావుకారి పండా, కాయా అన్నడు జక్కడు.

పండుగాలే కాయాకాలే అన్నడు సావుకారి. మరెట్లాబాంచెను అన్నడు రాజిగాడు.

మరెట్లరా కొంచెము ఓపికపట్టుండ్రి- ఇంకోఆరంరోజులైతె పోయినదినుసు అమ్మడుపోద్ది.... మీ పైసలు మీకిత్త అన్నడు.

మరి గదువర్దాక అట్టిగనే ఉండుమంటాన్రి అన్నడు జక్కడు.

గట్లెందుకుబిడ్డా.... ఏమన్నా అక్కెరుంటే సెప్పరాదు దాసుదెందుకు అన్నడు గుండయ్య.

దాసుదేమున్నదిగని సావుకారి సిల్లరకర్సు ఎల్లద్దా అన్నడు రాజిగాడు.

గదేముందిబిడ్డా.... అంతలావుఅయితె దుకాండ్ల కొంచపోరాదు అన్నడు సావుకారి ఉపాయంగా.

ఎదులాపురంపోయి ఒక్కదిక్కు తెచ్చుకుంటము అనే కుంచె గిట్లసేత్తిరి అన్నడు జక్కడు.

గదెందుకురా జక్కా....గాధరకే నేనిత్తా కొంచపోరాదు అన్నడు గుండయ్య సావుకారి.

సావుకారి.... ఇంట్లకుపోయిండు.

"సూసినావురా రాజిగా ఉప్పు సూసెకింద తేర్పవట్టె కిరాయి కట్టిన పైసలు.... అన్నడు జక్కడు. సావుకార్లు గట్లనేసేత్తారాన్రి.... గందుకే గింత గింత పేనికిపోతరు అన్నడు రాజిగాడు.

స్కెచ్

# కల

కన్‌రాజు

ఫ్యాక్టరీ గొట్టాల్లోంచి దుమ్ము చిమ్ముతోంది– అసహ్యంగా, మురికిగా, చెట్ల మీద, తళతళలాడే గచ్చుమీద, కళ్లల్లో, ముక్కులో, జుట్టులో, మెదట్లో అంతటా దుమ్ము పేరుకపోతోంది. ఉక్కిరి బిక్కిరిచేసే ఈ దుమ్ములోకూడా మనుషులు కళ్లనులుముకుంటూ, దగ్గుతూ, ఎండిన పెదిమలను నాక్కుంటూ గొనుక్కుంటూ, ఊరు పేరు లేకుండా తిట్టుకుంటూ పనిచేస్తుంటారు– జ్వరమొచ్చిన పసివాడు నిదురలో బెదిరినట్టుగా రాకాసిగొంతుతో మాటిమాటికికూసే సైరనుకూతకు బెదురుతూ తడబడుతూ దుమ్ములో తిరుగుతుంటారు. రాత్రిళ్లు ఇంటిదగ్గర భార్యాపిల్లలను వొదిలి– ఆఖరినెత్తురు బొట్టుదాకా ఈ దుమ్ములోనే ఇంకించి డబ్బు సృష్టించి ఎక్కడోదుమ్ము కనిపించకుండా ఏర్‌కండీషన్ గదుల్లోఉన్న కాళ్ళదగ్గర పోస్తారు– ఈబతుకు ఎంతో పవిత్రమైందిగా ఎంచుతున్నట్టు నటిస్తూ, వంగివంగి సలాములు కొడుతూ, దయ్యాల్లాగా ఈదుమ్ములోనే ఎన్నో సంవత్సరాలనుంచి దేనికోసమో వెతుకుతున్న వాళ్ళలాగా ఈదుమ్ములోనే తారట్లాడుతుంటారు.

గాలివీస్తోంది గోదావరిమీదినుంచి చల్లగా– కాని ఇక్కడికి రావడంతోటే ఈ గాలికూడా కలుషితమైపోయింది. ఈగాలికూడా వాడుసృష్టించిన ఆశల మాయజాలప్పు దుమ్మును మోస్తోంది విధిలేక– ఈగాలికూడా ఇక్కడ వానికరెన్సీ నోట్లకు లొంగిపోయింది. ఇదేగాలిని మోసంచేయడానికి నిన్న మొటిమెలమొఖపు పూరేడుకండ్ల ఖద్దరు బట్టలవాడు ఎడంచంకలో తోలుబ్యాగుంచుకొని అదేపనిగా యంత్రాల రొద చేసినట్టు మాట్లాడిపోయాడు. కార్మికులు వంచిన తలలెత్తలేదు– పెదవి కదపలేదు– ఒకరిద్దరు నీర్సంగా గొణిగారు– అది వాళ్ల గొంతుదాటలేదు– ఇవ్వాల్లే ఇంకొకడు– వీడు మాట్లాడిందిఅంటే– చేతులుతిప్పడం ఎక్కువ మళ్లీమామూలే– ఈమాటలు ఈ ఫ్యాక్టరీ యంత్రాలరొద మొదలైన దగ్గరినుంచి వింటూనేఉన్నారు– పెదవులు చప్పరించేస్తున్నారు– ఫ్యాక్టరీ సైరన్ ప్రతిరోజు కూస్తూనేఉన్నది.

"ఇదేదుమ్మును వాని ఏర్‌కండీషన్ కండ్లల్లోకి చిమ్మగలిగితే" అమాట గురించి ఎవరూ పట్టించుకున్నట్టు కనిపించరు– వాళ్ల దుమ్మునిండిన మెదళ్లలోకి రేపటి ఆశలవైఫల్యం గురించిన ఆలోచనరాదు– రాత్రిపగలూ జీవితమంతా యంత్ర భూతముల కోరలుతోముతూ, గ్రీసుఆయిలు ఓడే మొఖాలతో ఈ దుమ్ములోనే [illegible]

దగా గురించిన ఆలోచనకు సమయంలేదు పైకిరాగలదన్నకొడుకు చదువులకుట్రిలో ఇరుక్కొని గిలగిల్లాడి- బతుకుతూ చచ్చినట్టు వీధులవెంట ఎంగిలి విస్తర్లకోసం పొత్తకుండీలచుట్టూ నాలుక వేళ్ళాడేసుకొని తిరిగేకుక్కలా ఉద్యోగాలకోసం తిరుగుతాడు తన తండ్రితోమే యంత్రాల యజమానులు లాభంగురించి మనుషులకంటే యంత్రాలనే ఎక్కువగా నమ్ముకుంటారని ఆ నిరుద్యోగి అర్థంచేసుకోడు- కూతురువ్యాపార సంస్కృతిలో పెంచుకున్నకోర్కెలు వయసుమీరి అయితే గొంతు నులుముకుంటాయి. లేకుంటే కడుపు చేసుకుంటాయి- అక్కణ్ణుంచి పడుపువృత్తి సాలెగూడులో ఇరుక్కుపోయిన ఈగలా కొట్టుకుంటుంది.

యంత్రాలా మనిషినోరు నొక్కుతాయి- అప్పుడు ఏడ్వడానికికూడా నోరు పడిపోతుంది- వంగిపోయిన పాతచెప్పులాంటి బూసురండ్లముసలి మిల్లు అటెండరుకి పళ్లే కడుపుఉబ్బుతుంది- కండ్లుతేలవేసి అయిపోయింది- సెట్టింగవుటైపోయిందని బస్కీలుతీసిన ఆ అటెండరు తల వేలాడేసినట్టుగా వేలాడేస్తారు- "రాసిపెట్టినచావు" గురించి గొనగడంతప్ప ఎవని ఎండిపోయిన కళ్లల్లోనూ నీళ్లారవు.

దగాపడ్డమని తెలుసుకునేసరికి పిడికిలి నిర్జీవమైంది- జీవమున్నప్పుడు పిడికిట్లో సత్తువున్నప్పుడు ఇనుపఊచలమీద- యంత్రాల అవయవాలమీద దెబ్బవేయడానికి రక్తం ఇగిరిపోయింది.

నువ్వు....

ఒంటరిగా గొనుగుతూ, తిట్టుకుంటూ, సమాధానపడుకుంటూ బేరీజు వేసుకుంటూ, మాటలను కూడదీసుకుంటూ, కార్మికులచుట్టు తిరుగుతుంటావు- రణగొణధ్వనిలో నీమాటలు వినిపించవు- మాటలు, తిట్లు, కోపాల మెరుగుడు, కసురుడు, యంత్రాల చప్పుడుతప్ప వినజాలని చెవులు నీమాటల పట్టించుకోవు.

"రూపాయల కాయిదాలు గారడీచేస్తున్నాయి- నీరక్తం, మూలుగు, సుఖంఅన్నీ అన్నీ ఈ దుమ్ముకింద నలిగిపోతున్నాయి"- అంటావునువ్వు. ఇదేదో పిచ్చివాడి ప్రేలాపన అనుకుంటారు విన్నవాళ్ళు, చెవులు దిమ్మెక్కినవాళ్లు నీనోటికేదో రోగమొచ్చిందనుకుంటారు.

మహా అయితే మరో రూపాయినోటుకో- సగంపూట సెలవుకోతప్ప చేసిన వాళ్లలాగా, తలలువంచుకొని గేటుముందు నిలుచుంటారు—— ఆమాత్రానికే యజమానులు పంచిన తలలమీద లాఠీచార్జీ చేయించుతారు- మాటలు నేర్చిన తెల్లబట్టల

రూపాయో, పావురోజు సెలవోయిస్తారు యజమానులు— తూకం సరిపోతుంది.... అంతకంటె ముందుకు జరుగదు పరిస్థితి.

నీ మెదట్లో మళ్లీ ఆలోచన— నీ కళ్లల్లో అదేమంట— నిదురరాక కోపం పోక గొనుగడం— పుస్తకాలు— సనుగుడు— ఆశ— నెత్తురుపూసుకున్న జెండమీద అచంచల విశ్వాసం. అమరవీరుల ఆశయం— పారిస్ కమ్యూన్— 1917 మాస్కో, 1949 స్క్వేర్ మైదానంలో మావో చప్పట్లకు ముందు ఏడుపు. హోచిమిన్ కవిత్వం.... డార్జిలింగులో సూర్యోదయం— శ్రీకాకుళం కొండల్లో ఇంకిన సత్యం నెత్తురు మెరుపు— గోదావరి ఆవలి ఈవలి ఒడ్డు పురిటినొప్పులు— అన్నీ నీ ఊపిరిలో మార్పుమీద నమ్మ కాన్ని ఊదుతాయి— ఈ నమ్మకం ఆత్మత్యాగంతో కూడుకున్నది. ఈ నమ్మకం ఎంతో ఉన్నతమైంది.

మళ్లీ దుమ్ములో యంత్రాలచుట్టూ— నీ ఆశలను, కలలను పేరుస్తూగొనుగుతూ— మరో ప్రపంచం గురించి, దుమ్ములేని ప్రపంచం గురించి, యజమానుల మొరుగుడు, క్రూరమైన, దురాశా పూరితమైన లాభాపేక్షలేని— మానవులు జంతువులుగా, సగం చచ్చినవాళ్ళగా, బానిసలుగా, బద్మాషులుగా కాకుండా మానవులుగా బతుకగల సమాజం గురించి చెప్పుకొస్తావు— ఎప్పుడో ఒకప్పుడు ఆగద్దచూపుల లొటపెట పెదువుల దుమ్ము అద్దాల నల్లటి ముసలివాడు ఒళ్ళు వణవణలాడుతుండగా చేతిలోని సుత్తి ఎత్తిపట్టు కుంటాడని నీఆశ— ఆ ఎండిపోయిన రొమ్ము టాలీచెక్కర్ నూనెమరకల ఖాళీ కాగి తపు పొట్లాల మధ్యనుంచి, పవ్వ బ్రాండి ఖాళీసీసాల మధ్యనుంచి సన్నని ఏడుపు గొంతుతో "కిరోసిన్ పోసుకొని నా భార్య చచ్చినందుకు కసిగా కిరోసిన్ ఈ వ్యవస్థ మీదనే పోస్తాను" అంటాడని నీ ఆందోళన. ఆ మిడతగుడ్ల పొట్టిబట్టతల గోధుమ రంగు ఎండుపెదిమిల నదీము డ్రిప్ట్సమన్ "గోదావరితీరం పల్లెటూళ్లకు మల్లే బతుకుంటుందా ?" అంటాడని నీ ఎదురుచూపు— ఆ పొట్టిఅమ్మోరు మచ్చల మిషనిస్టు తనపెళ్ళాం తను ఎప్పటికైనా కలిసి జీవించగలమా ? అని అడుగుతాడనుకుంటావు— ఆ గూని గ్రీసర్ "తనకొడుక్కు ఉద్యోగం దొరుకుతుందా"అని ఆ గడకర్రలాంటి, చప్పిడిదవడల, తాబేలువీపులాంటి మొఖంగల ఇంజినీరు గొంతు వణుకుతుండగా "My first wife died because of this cruel inhuman work" (నా భార్య కూడ ఈ అమానుషమైన పనివల్లనే చనిపోయింది) అంటాడని నీఆశ.

ఎవరు ఏదీఅనరు— మాట్లాడరు— విననట్టునటిస్తారు. కాని అన్నీవింటూనే ఉంటారు. అన్నీ గమనిస్తూనే ఉంటారు. ఫ్యాక్టరీగోడకతికించిన ఎర్రి వాల్‌పోస్టరు దొంగతనంగా అందరుచదువుతారు— మెడలురిక్కించి కిలిన్ ప్లాటుఫారంమీన్నుంచి గోదావరివేపుచూస్తూనే ఉంటారు.

అనువాద కథ:

# విలువలు

షెహ్‌జంగ్ గ్రామం చేరను చాలా రోజులు పట్టేట్లేవుంది. ఈలోగా మా కంపెనీ మొత్తంమీద ఒక్క బియ్యపుగింజ కూడా లేకుండా పోయింది. ఇంతగా ఆకలి దప్పులతో మలమల మాడటం మాలో చాలా మందికి యిదే మొదటిసారి. ఇక మాకు ఆహారంగా మిగిలిందల్లా గుర్రపు ఎముకలు; గుర్రపు పెంటలో జీర్ణంకాక మిగిలిన బార్లీగింజలు. సైన్యపు వెనక శ్రేణిలో వుంటంతో దీనికైనా ఎల్లప్పుడూ నోచుకోగలమా అంటే, అదీ సందేహమే। చాలామంది కామ్రేడ్లు ఆకలికి మెలికలు తిరిగిపోతూ, వెనకబడిపోతున్నారు. కంటికికనబడ్డ దుంపలు, గడ్డి.... ఏదైతేనేం, పరమ సంతోషంగా వండుకుతింటున్నాం. ఆ వంట కషాయం కావచ్చుగాని, వుత్త నీళ్ళకన్నా మెరుగే.

"ఆకలికి ఓర్చుకోండి.

విజయంకోసం – విప్లవం కోసం

పదండి ముందుకు, పదండి పోదాం–" అన్నదే మా సమరనినాదం.

త్వరలో షెహ్‌జంగ్ గ్రామం చేరుతున్నామని ఎవరో చెప్పేసరికి, మా కళ్ళ ముందేదో ఆశ మెర మెర లాడింది. మా అందరికీ పెద్దవిందు దొరకచ్చనే అనుకొన్నాం. జబ్బుపడి, వెనకబడ్డవాళ్ళు కూడా, కాళ్ళీడ్చుకొంటూ మమ్మల్ని కలిశారు. నడవలేని స్థితిలో వున్నవాళ్ళు సహచరుల ఆసరాతో వూరుచేరుతున్నారు. మా అందరి చూపు ఆ గ్రామంమీదే. అన్నీ సమృద్ధిగా దొరుకుతాయనే మా ఆశ.

---

నీఆశ కాదుకల కాదుకాదువాస్తవం– బద్దలౌతుంది.

ఎట్లాగా ?

అది నీ కలలాకాదు— వాస్తవంలాగానే.

దుమ్మునిండిన కళ్ళు ఎరుపెక్కుతాయి– చెక్కుకుపోయినట్లున్న ముఖంగల పొట్టివాడు అరుస్తుంటాడు– అమ్మోరుమచ్చల మిషనిస్టు గోడపాకుతుంటాడు– గద్ద కండ్ల ముసలివాడు గెంటుతూ రక్తపురంగుజెండా ఎత్తుకుంటాడు.

అప్పుడు ఏర్‌కండీషన్‌గదుల పునాదులు గజగజలాడుతాయి– ఇదే ఆఖరా ? కాదు.... కానేకాదు.... ఇది కొలిమిలో ఇనుము కరగడమే.... ఇది నేలలోవిత్తనం విత్తడమే – పనిముట్లు తయారుకావాలి– మానవులందరికీ ఉపయోగపడాలి– పంట రావాలి అందుకు తిసగలగాలి– సమ్మెటదెబ్బలు, ఒళ్లుకాలడాలు, చెమటకారడాలు, నెత్తురుకారడాలు, నీళ్లపెట్టడం– కలుపు, తెగుళ్ళు, మందులు, ప్రకృతివైపరీత్యాలు, క్రిమి కీటకాదులు, పశు పక్ష్యాదులు– ఎన్నిటినుంచి రక్షించుకోవాలి.

మానవుడు ప్రకృతిచేతిలో కీలుబొమ్మకాదు– ప్రకృతిని మలుచుకోగలదిట్ట—

ఊరు చే....రాం....తీరా అక్కడచూస్తే ఏముంది ? మూడంటే మూడే యిళ్ళు. ఎక్కడా ఎలాంటి కదలిక లేదు. అంతా నిర్మానుష్యంగావుంది.... ఊరంత వెతికినా ధాన్యపుగింజ కూడా కనబడలేదు.... పటునిరాశ, పటుదుఃఖం.... విప్లవం విందు భోజనంకాదు.... నిజమే, నిజమే ! !

మావాళ్ళ పాలిపోయిన మొహాల్లోకి, తడారిపోయిన పెదాల్లోకి చూస్తుంటే, నాగుండె పిసికేసినట్లయింది- వాళ్ళు కాకలుతీరిన వీరయోధులే- విప్లవదీక్ష నిబద్ధులే- గొంతులోవూపిరి వున్నంతదాకా, అడుగుతీసి అడుగేస్తూ ముందుకు సాగేవాళ్ళే- కాళ్ళల్లో సత్తువ అయిపోతే, మోకాళ్ళమీదపాకి, మోచేతులమీద దేకిఅయినా గమ్యం చేరాలనే ఉక్కుమనుషులే- ఇప్పటికే ఎంతోదూరం నడిచారు. ఇంకా ఎంతోదూరం సాగిపోవాల్సిఉంది.

ఈ కషాయం తాగుతూ, ఆకులూ అలములూ తింటూ ఇలాఎంతకాలం ముందుకు పోగలం ? ఆందోళనా, ఆదుర్దాలతో సతమతమై పోతున్నాను. మాకంపెనీ కమాండర్ చాంగ్ సియెన్-ఝున్, నేనూ పిడికెడు మెతుకులకోసం తిరిగి తిరిగి అలసి సొలసి పోయాం

ఇంతలో ఒకయింటికి చేరువలోనున్న పశువుల కొట్టంనుంచి, మా సార్జెంట్ చెయ్యూపుతూ కనిపించాడు- ఆ కామ్రేడ్ కళ్ళలో ఏదో అమూల్యమైన గుప్తనిధి కనుగొన్న మిలమిలలు.... ఉద్రేకంతో వూగిపోతూ, తనవైపు రమ్మని సంజ్ఞ చేస్తున్నాడు- మేం హడావిడిగా అక్కడికి పరుగుతీశాం.

ఒకమూల ఎండుగడ్డి పడివుంది. అక్కడక్కడ చిందరవందరగా పడ్డ బార్లీ గింజలు కనిపించాయి- మాకామ్రేడ్ ఆగడ్డిని తొలగించాడు- పేడతో అలికినట్లుగా వున్న జాగాని పెల్లగించాడు- ఎండిన ఆపేడ పెల్లలకింద బల్లచెక్క, అదీతొలగించి చూస్తే.... పెద్ద జాడీనిండా బార్లీగింజలు- ఓహో ! కలా ? నిజమా ?

"నేవెళ్ళి పారతీసుకురానా ?" అన్నాడు సార్జెంట్ కామ్రేడ్, వుత్సాహంగా.

"ఒకక్షణం" అన్నాను ప్రజలకి సంబంధించిన వ్యవహారాలలో, వాళ్ళ ఆస్తుల పట్ల మనం జాగ్రత్తగా, క్రమశిక్షణతో వ్యవహరించాలి- టిబెట్ జాతీయుల అనుమతి లేకుండా, ఒక్కగింజకూడా తీసుకోవడానికి వీలులేదు.

మా కమాండర్ ఏమీఅనకుండా మౌనంగా వున్నాడు- నా అభిప్రాయాలే ఆయన మౌనవదనంలో వ్యక్తమవుతున్నాయి. మేం ఆలోచిస్తున్నకొద్దీ, ఆ కామ్రేడ్‌లో ఆతృత పెరిగిపోతోంది.

"అయితే ఏం చేయాలంటారు కామ్రేడ్స్ ? మనవాళ్ళకి తింటానికి యింకేమీ దు."

ఆ బార్లీగింజలనిచూస్తూ నేను ఎటూ తేల్చుకోలేక, సందిగ్ధంలో పడ్డాను. అటు చూస్తే, తీవ్రమైన కరువుపాతబడి, కొనవూపిరితో వున్న కామ్రేడ్లు; యిటుచూస్తే పార్టీ క్రమశిక్షణ.

ఏదైనా సూచన దొరుకుతుందేమోనని, సార్జెంట్ మా కళ్ళలోకి ఆశగా రెప్ప వేయకుండా చూస్తున్నాడు.

"మన పార్టీ కమిటీ మీటింగ్‌వేసి, యీ సమస్యను చర్చించి పరిష్కరిద్దాం" అన్న నా సూచనను మా కమాండర్ వెంటనే అంగీకరించాడు.

వెంటనే పార్టీశాఖ అత్యవసర సమావేశం ఏర్పాటయింది. బార్లీ దొరికిందన్న వార్తవిని, అంతా ఎగిరిగంతేశారు. పార్టీ క్రమశిక్షణ, ఎర్రసైన్యం అనుసరించాల్సిన వైఖరి గురించిన నా అభిప్రాయాలను వివరించాను. అంతా స్తబ్దంగా వుండిపోయారు. క్షణకాలం క్రితం వెల్లివిరిసిన సంతోషం చిటికెలో మాయమైంది. ఒకరి తర్వాత ఒకరు మాట్లాడారు. ముందుగా, మొదటి ప్లెటూన్ లీడరు యాంగ్ చెంగ్-హై మాట్లాడాడు.

"కామ్రేడ్స్ ! ఎర్రసైన్యం ఎటువంటిదో, ఎందుకేర్పడిందో టిబెట్ ప్రజానీకానికి తెలియకపోవచ్చు. బహుశా, శత్రువులు మన గురించి చేస్తున్న విషప్రచారానికి వాళ్ళు లోనుకావచ్చుకూడా. అందుకేనేమో, వాళ్ళెవరూ మన కనుచూపు మేరలో లేకుండాపోయారు. ఈ పరిస్థితుల్లో వాళ్ళ ఆహార నిల్వలని వెలికితీసి వాడుకొంటే, మనగురించి అభివృద్ధి నిరోధకులు చేస్తున్న మోసప్రచారపు వుచ్చుల్లో పడిపోయినట్లే అవదా ? ఆలోచించండి, కామ్రేడ్స్ ! ఇదే మార్గాన మనకన్నా ముందుపోయిన అగ్రగామి దళం కూడా ఆకలితో నకనకలాడి పోయుంటారు. అయినా వాళ్ళెవరూ యీ ఆహార నిల్వలని ముట్టుకోకుండానే సాగిపోలేదా ? వాళ్ళే అలావెళ్ళగాలేంది, మనమూ సాగిపోలేమా ? మనమూ ముందుకు సాగిపోగలం కామ్రేడ్స్ ! ఎర్రసైనికునికి రాజకీయ నిబద్ధతతోపాటే, నైతికమైన విలువలు, చిత్తశుద్ధి కూడా అవసరం. మనమూ ఆకలితో చావనైనాచద్దాంగనీ, ఒక్క గింజనికూడా తాకొద్దు".

ప్రతిఒక్కరం ప్రాణాలు బిగబట్టివిన్నాం- నిజమే, ప్లాటూన్ లీడర్ ఎంత చక్కగా చెప్పాడు.

కొద్దిక్షణాలు అంతటామౌనం– "కామ్రేడ్ యాంగ్ అభిప్రాయాలతో సంపూర్తిగా నేను ఏకీభవిస్తున్నా" నంటూనే, రెండవ ప్లాటూన్ లీడర్ హాన్ యావో–చి యింకా యిలాఅన్నాడు– "కామ్రేడ్స్ ! మనకంపెనీలో కనీసం డజనుకుపైబడి నీరసంగా, జబ్బుతో బాధపడుతున్నారు. ఒక్కబుక్కయినా తినకుండా, ఒక్కఅడుగు కూడా వేసేస్థితిలోలేరు– కనీసం వాళ్ళవరకైనా మనం తిండిని సమకూర్చను అనుమతి వుండదా ?"

చాలారోజులుగా తిండిలేకపోవటంతో, కొంతమంది తీవ్రంగా జబ్బుపడ్డవైనం తెలుసు– వాళ్ళజబ్బుకి వైద్యం ఆహారమేకాని, మందులుకావు. కామ్రేడ్ లై యూ–షి నిలబడను, నడవనుకూడా ఓపికలేకుండా పోయాడు. మరీ రెండురోజులుగా మేము వంతులవారీగా అతన్ని నడిపిస్తున్నాం– పల్చటి ఎండిపోయిన శరీరం పొరలనుంచి పూగులాడుతున్న ఎముకలగూడులా అయిపోయాడు.

మా ప్రాణంలో ప్రాణమై, ఆశయంలో భాగమైన మా వర్గసోదరుడు కొద్దిపాటి గంజికికూడా నోచుకోక, ఆకలితో విలవిల లాడిపోతుంటే చూస్తూ మౌనసాక్షిగా మిగిలిపోవల్సిందేనా ?

ఈవేదన గుండెలోతుల్లోంచి పైకి పొర్లుకొచ్చి మమ్మల్ని వేధిస్తోంది.

మాకు తిండికావాలి ! కానీ అదే సమయంలో పార్టీ క్రమశిక్షణని, నైతిక విలువలని పాటించాల్సిందే. ఈ సమస్యని అన్ని కోణాలనుంచి పరిశీలించిన అనంతరం, పార్టీ ఒక నిర్ణయానికొచ్చింది.

"ప్రజలనుంచి తీసుకున్న ఆహార నిల్వలకి, సరిపోను పైకం వెండి డాలర్ నాణాల్లో చెల్లించాలి." ఆహారనిల్వలకి న్యాయమైన ధర చెల్లించినట్లు అవుతుంది; మా కంపెనీ ఆకలి బాధనుంచి బయటపడ్డట్టూవుంటుంది; జబ్బుపడ్డవాళ్ళు బతికిబట్టకట్టినట్లుఅవుతుంది.

అంతాకదిలి పని ప్రారంభించి, జాడీల్లో భద్రపరచిన రెండువందల కిలోల బార్లీని వెలికితీశారు. మరిగే నీటిబుడిమూత మోతలాగా అంతటా ధ్వనిపూరిత సంతోష తరంగాలు. అందరి వదనాల్లో చిరునవ్వు వెలిగిపోతోంది. పెహాజంగ్ గ్రామానికే కొత్తకళ వచ్చినట్లువుంది.

జబ్బుపడ్డ కామ్రేడ్లకి ఒక్కొక్కరికి ఎనిమిది చిన్నగిన్నెల బార్లీ, సైనికులకి అయిదు చిన్నగిన్నెల బార్లీ, అధికార్లకి మూడు చిన్నగిన్నెల బార్లీ వంతున అందరికీ

ఆ నిల్వలు పంచాలని పార్టీశాఖ కమిటీ నిర్ణయించింది. చాలా రోజులుగా ఖాళీగా మూలపడ్డ ఆహారపు సంచులు నిండుగా, బరువుగా మా భుజాలపై చేరాయి.

బార్లీ దొరికిన స్థలంలోనే, వెండి డాలర్ నాణాలు వుంచాలనుకున్నాం. మా అభిప్రాయాన్ని ఒక కామ్రేడ్ ఎర్రచీటిపైరాసి, డబ్బుతో జతచేశాడు. అందులో....

ప్రియమైన ప్రజలారా !

మీ బార్లీ ఆహార నిల్వలని వెలికి తీసి వాడుకున్నందుకు తీవ్రంగా విచారిస్తున్నాము. అందుకు మేం చెల్లిస్తున్న యాభై వెండి డాలర్ నాణాలని అంగీకరించాల్సిందిగా కోరుతున్నాం.

రెండవ కంపెనీ
చైనా రైతు-కూలీ
ఎర్రసైన్యం

ఈ డబ్బుని నీలిరంగుగుడ్డ సంచిలో వుంచి, బయటవైపున ఎర్రచీటి తగిలించాం. ఈడబ్బు యింకా సరిపోదేమోననిపించిన మా సార్జెంట్ కామ్రేడ్, మరో పన్నెండు వెండి డాలర్ నాణాలు అదనంగా చేర్చాడు. బార్లీదొరికిన జాడీల్లో ఈసంచినివుంచి, మళ్ళీ జాగ్రత్తగా నేలలో భద్రపరిచాం. మొత్తం ఈ కార్యక్రమంఅంతా సవ్యంగా ముగిసిందాకా అంతా అక్కడేవుండి, ఆపై ముందుకిసాగాం.

నైతిక విలువలనేవి ఈ ప్రపంచంలో విలువైన విషయం. కమ్యూనిస్టుపార్టీ యీవిలువలకి అత్యధిక ప్రాముఖ్యత నిస్తుంది.

చైనా కథ - A Party Branch Committee Meeting.
రచయిత Chien Chi - An [ఛీన్ ఛి-అన్]

- అనువాదం : శ్రీకాకుళరావు

---

సవరణ

**ఈ సంచిక 15 వ పేజీలో మొదలయిన 'నాడె' కథ రచయిత ఎ ఎన్ కు బదులు వెంకన్న అని చదువుకోవాలి.**

# మృత్యువు కౌగిలిలో పెళ్ళి

మొలీనా

చౌవెన్ యాంగ్, చెన్ టీచున్ — వీళ్ళిద్దరూ 1920-30 సంవత్సరాల మధ్య కాలంలో చైనా కమ్యూనిస్టు పార్టీలో రహస్యంగా పనిచేశారు. చెన్ టీచున్ ఒక కళాశాల విద్యార్థిని. ఆ తర్వాత పార్టీ మహిళల విభాగానికి నాయకత్వంవహించింది. గ్వాంగ్‌చౌ మునిసిపల్ పనివారి ఉద్యమ కమిటీకి చౌవెన్‌యాంగ్ కార్యదర్శిగా వుండేవాడు. 1927 ఏప్రిల్‌లో కోమింటాంగ్- కమ్యూనిస్టు ఐక్య సంఘటనకు చాంగ్ కైషేక్ వెన్నుపోటుపొడిచి, కమ్యూనిస్టులను పెద్దసంఖ్యలో చంపడం మొదలు పెట్టిన తర్వాత, గ్వాంగ్‌చౌ పట్టణంలో సాయుధ తిరుగుబాటును లేవదీయడంలో చౌవెన్‌యాంగ్‌కు సహకరించవలసిందిగా పార్టీ చెన్ టీచున్‌ని ఆదేశించింది.

వాళ్ళిద్దరూ భార్యాభర్తలుగా నటిస్తూ, వాళ్ళింట్లో ఒక రహస్య సంబంధాల కేంద్రాన్ని నెలకొల్పారు. ఆ తిరుగుబాటు విఫలమయినప్పుడు అభివృద్ధి నిరోధక కొమింటాంగ్ అధికారులు వాళ్ళిద్దరినీ అరెస్టు చేశారు. ఘోరమయిన చిత్రహింసలకు గురిచేసినప్పటికీ లొంగక పోవడంతో వాళ్ళకు మరణశిక్ష విధించారు. వాళ్ళను కాల్చేసే ముందు అక్కడ గుమికూడిన ప్రజలకు వీడ్కోలు పలుకుతూ, తన శాలువాను అతని భుజాలచుట్టూ కప్పి అతనికి దగ్గరగా జరిగి, గొంతు పెద్దదిచేసి చెన్‌టూచున్ ఇలా చెప్పింది.

"కమ్యూనిజం కోసమూ, ప్రజల విముక్తికోసమూ ఇంకొద్దిసేపట్లో మేము మా రక్తాన్ని ధారపోస్తాం. అందుకు మేము కొంచెం కూడా బాధపడటం లేదు. గ్వాంగ్‌చౌ పట్టణంలో తిరుగుబాటును తీవ్రతరం చెయ్యటం కోసం భార్యాభర్తల ముసుగులో ఒకే ఇంట్లో వుండి పనిచేయమని పార్టీ మమ్మల్ని ఆదేశించింది. ఇద్దరం కలిసి సమర్థవంతంగా పనిచేశాం. ఒకరిమీద ఒకరం గాఢమైన ఆత్మీయతల్ని పెంచుకున్నాం. కాని విప్లవ ప్రయోజనాల దృష్ట్యా మా ప్రేమను వ్యక్తం చేసుకునే సమయం దొరకలేదు. అయితే ఇప్పుడు మృత్యుముఖాన నిలబడి మేము పెళ్ళిచేసుకోవాలన్న నిర్ణయాన్ని ప్రకటిస్తున్నాను. శత్రువు తుపాకి గుళ్ళశబ్దమే **మా** పెళ్ళి శుభాకాంక్షలు." (Let the enemy's bullet be our wedding salvoes).

ఆ వీరులిద్దరూ పలికిన ఆఖరి మాటలు :

"కామ్రేడ్స్ మీకందరికీ వీడ్కోలు. మీరు ధైర్యంగా పోరాడుతారని ఆశిస్తున్నాం.... కమ్యూనిజం గెలుస్తుంది భవిష్యత్తు మనదే."

సుమారు 50 సంవత్సరాల తర్వాత ఆ అమరవీరుల వాస్తవగాధ చైనా అంతటా నాటకంగాను, సినిమాగాను రూపొందించబడింది.



నవల — సీరియల్

చౌ లి-పో

రెండవ భాగం

(గత సంచిక తరువాయి)

**17**

కువో, పాయిపనిమీద వెళ్ళిపోయేక, కాఁవందుల దగ్గర జప్తుచేసుకున్న ఆస్తి పంచాలనుకున్నారు జనం. మిగతా జిల్లాల అనుభవంతో యువాన్‌మావో రైతు సంఘం కూడా 'గ్రేడింగ్' పద్ధతి అవలంబించింది. యోగ్యతనిబట్టి ఒక్కొక్కరి గ్రేడ్ నిర్ణయించి, దానికనుగుణంగానే యీ ఆస్తి పంచుతారు. దీనివల్ల పంపకం న్యాయంగా జరుగుతుంది. ఏఁవీ గొడవలుండవు.

రాత్రి, పగలు మీటింగులు జరుగుతున్నాయి. గ్రేడింగ్ మొదలుపెట్టిన మూడవరోజు చాలామంది వచ్చేరు. కొందరు తమని గ్రేడ్ చేయించుకోవాలనివస్తే, మరికొందరు పక్కవాళ్ళ తప్పులు ఎత్తిచూపడానికొచ్చేరు. ఈ రెండు కోవలకు చెందనివారు తమాషాచూడ్డానికొచ్చేరు. వాంగ్ భార్య, గాడిదలీ కూడా వచ్చేరు.

రైతుసంఘం ఆఫీసు పడమటిభాగంలో రెండుచోట్ల కట్టెలతో వేసిన చలిమంటలు వెచ్చదనంతోపాటు పాతవాసనలు వెదజల్లుతున్నాయి. అడ, మగ రెండు కాంగ్‌లమీద ఒదిగికూర్చున్నారు. పడమటి వేపంతాజనం కిక్కిరిసిపోయేరు. ఆలస్యంగా వచ్చిన వాళ్ళు నిల్చున్నారు. మీదినుంచి వేలాడుతున్న రెండు లాంతర్లు కింద మండుతున్న మంటలపైగా అటుయిటు వూగుతున్నాయి. జనం పైపులుకాలుస్తూ పొద్దుతిరుగుడు గింజలు ఒలుస్తున్నారు. ఆడవాళ్ళు నవ్వుతున్నారు. ఓల్డ్‌సన్ కబుర్లుకొట్టిపోస్తున్నాడు. మంటలు, వెలుగు, పొగ-పండగ వాతావరణం ఒచ్చింది. మునుపు వెండి, బంగారం పైకితీయడానికి కూడిన మీటింగులకు, దీనికి చాలా తేడా కనిపిస్తోంది.

గ్రేడింగ్ కోసం వచ్చినవాళ్ళు ఒకరి తర్వాత ఒకరొచ్చి తమ పేరు, స్థితిగతులు చెప్తారు. సియావో తలుపుదగ్గర ఓ బల్లమీద కూచున్నాడు. అతనికి మనుషుల

ముఖాలు కనిపించకపోయినా మాటలు బాగానే వినిపిస్తున్నాయి.

"నాపేరు 'చు' ఫు-లిన్. మూడు తరాలుగా మాఁవు రైతుకూలీలఁవే. దీన్నెవ్వలు మించగలుర్రి?"

గదికి పడమరగా గోడకానించి ఓ నలుచదరపుబల్లవుంది. గ్రేడింగ్ నిర్ణయిస్తున్నసభ్యులు అక్కడకూచున్నారు. 'చు' తనసంగతి చెప్పేక, వారిలో ఓ ఛైర్మన్, 'చు'కి మొట్టమొదటి స్థానం ఇవ్వొచ్చు, మీరేఁవంతారు?" అని అందర్నీ అడిగేడు.

"చు నిజాయితీగానే బతికేడు- పొలం సాగుచేసుకుంటూ, చేపలుపడుతూ వుండేవోడు- కిందటేడు అదోపెద్ద 'తిమింగలం' పట్టేడు- అందుకని ఆడికి మొదటి నంబరే యివ్వాల" అన్నారెవరో కాంగ్‌మీదనుంచి- 'తిఁమింగలం' ఆరోనంబరు హాన్ అని అందరికీతెలుసు, అందుకే నవ్వుకున్నారు.

మరో కాంగ్‌మీదున్న ముసలతను,

"ఈడిబాబు నాకెరికే- ఆడుమంచోడు- జలఁవపొడుగునా సాగునేలమీదే బతికేసేడు"అని సమర్థించేడు.

"అయితే ఇతనిలో తప్పులేన్నేవా? అనడిగేడు ఛైర్మన్.

"నేవు" అన్నాయి చాలాగొంతులు.

తర్వాత అందరివెనుక చీకట్లో కూచున్న ఒకతనుమాత్రం అభ్యంతరపెట్టేడు- "ఆడిదోతప్పున్నాది" అంటూ.

"పైకొచ్చిమాటాడు, మాకు యినరాలేదు"అన్నారు చాలామంది- కానిభయం వల్ల అతనురాలేదు- పైగా, "పోనిద్దురూ, అదిశానా సిన్నపొరపాటు" అన్నాడుమళ్ళా.

"పోనీ ఆడనేవుండి సెప్పు, బేగి" అన్నాడు ఛైర్మన్.

"ఈడు సిన్నప్పుడు పందులకాపరి- అప్పుడు మొక్కజొన్న కంకులు దొంగతనంగా కోసుకునీవోడు."

చు ముఖం కందిపోయింది- నిల్చుని, "నిజఁవే- రోజు తెల్లార తిండితినకుండా పందుల్ని మేపీవోన్ని- ఒకోమారు బాగాఆకలేసి మొక్కజొన్న కంకులుకోసీవోన్ని- అప్పుడు శానాసిన్నోన్నిన్ని- తప్పనికూడా ఎరికనేదు" అన్నాడు.

ఓ ముసలతను, "అదితప్పెనాగవుతాది? దిక్కుమాలిన జలఁవంతా కాఁవందు మనని దోసీసుకుంటే, మనం ఒకటో రెండో కంకులు కోసుకుంతేతప్పా? ఆకలి

మీదున్న పందులకాపరిగాని, సొమ్ములకాపరిగాని పంటకొచ్చిన కంకులుసూసి కొయ్యకుండుంతాడా ?" అని సమర్థించేడు.

ఓ యువసైనికుడు మూలనుంచిలేచి, "నిజ(వే, అదినేరంకాదు- నానూఅలాగే సేసీవోన్ని- ఆడు కాం(వందుని యింకే(వన్నా తీసుకున్నా తప్పుపట్టేదినేదు- మన పెజలదో, మన గవర్మెంటుదో ఒట్టుకుపోతే మాత్రంతప్పే- ఓరోజు తాంగ్ పొలంలో పని సేత్తన్నాం- ఓగట్టు కోసేక సుట్టతాగనానికి ఆగేం- ఆమాత్రం జాగుకాం(వందు ఒప్పుకునీవోడు- కాని ఈడు అల్లంతదూరాన కాం(వందునిసూసి "సుట్టలొగ్గియండి- పొద్దుగుంకుతున్నాడు- ఇంకోగట్టు కొయ్యాలి, పనుసురుగ్గాసాగాల" అని అరిసేడు- కాం(వందుని సూడగానే ఆడి లొత్తునాగ ఎందుకనాగ అరిసేవు ? ఆడిని మనోకా కొట్టాలనుకున్నావా ? అది తప్పుకాదూ ?" అని సూటిగా అడిగేడు.

"నిజ(వేనా ?" అని 'చు'ని చైర్మన్ అడిగేడు- సిగ్గుతో కందిపోయిన అతని ముఖమంతా చెమటలు పట్టేసింది- అతనందరి మధ్యకొచ్చి చొక్కావిప్పి నిజాయితీగా తప్పొప్పుకున్నాడు.

"నాకు యాదస్తునేదుగాని నాను ఆ తప్పుసేసేవుంతా- అప్పుడు నానో కుమ్మమొద్దుని, నాకేటితెల్దు. ఉప్పుడంతా మారిపోనాది. పార్టీ అంతానూసుకుంతాది".

ఈ విషయంమీద చర్చసాగింది.

"అది తప్పెనాగవుతుంది? పూర్వం కాం(వందుని ఎదిరించే దమ్ములెవ్వరికుండేవి?

"అయితే కాం(వందు కొమ్ముకాయాల్నా ?"

"అదికాం(వందు కొమ్ముకాయడమెలా అవుతుంది ?"

"ఎందుక్కాదు? మన(మెవ్వరికోసం పనిసేత్తుండాం(వో మనకు గురుతుండాల. కాం(వందు పనిచేసినపుడు కొంత జాగుసేసినా పర్నేదు- కాని మనపొలం సాగుసేసినా, ఎని(విదోదళ సైన్యానికి పనిసేసినా తెలివిగుండాల- పెతిపనికి రెండిసయాలుంటాయి"

సియావోకి వాళ్ళమాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"ఇలాసీత్తే తప్పుసేసినోల్లు లబలబ ఒప్పుకోవలసిందే!"

"మన గవరమెంటు శానా మంచిపనిసేత్తుండాది- ఇనాగందరిముందు తప్పు బైటపెడితే, అందరుకలిసి మాటాడుకుంతే మంచి తీరుపుఒత్తాది"

"ఆ 'ఎయ్యికల్ల బుద్దుడి'కన్నా జనం బాగాసూడగల్రు- మంచో, సెబ్బరో- తప్పిపోదు. నాను సూడనేకపోతే నువ్సూత్తావ్- నువ్సూడకపోతే ఆడుసూత్తాడు- ఎవులో ఒకరు సూసితీరతాడు"

"జనంగడ్డివాఁవిలోని సూదినికూడా సూడగలుస్తారు"

"ఇది రాజదరుబారునాగున్నాది"

"ఇది తమాసాకాదు- దీనివల్ల మనం, మనపిల్లలు, పిల్లలపిల్లలు ఏడుంతారో తెలిపోతాది"

చు సంగతి ఎటూతేల్చకుండా చర్చించుకుంటున్నారు- ఇంతలో, అంతవరకు బైటగదిలో ఎవరితోనో మాట్లాడుతూండిపోయిన చావోభార్య లోపలికొచ్చింది- ఆఁవె ఏమీ అనకుండానే ఎవరో "చావో యు-లిన్ భార్యకి మొదటినెంబరివ్వాల" అన్నారు.

చావో భార్యనిచూడగానే అందరికీ చావో గుర్తొచ్చేడు- అతను బందిపోటులతో పోరాడుతూ చనిపోయేడు- అతనిభార్య మళ్ళీ పెళ్ళిచేసుకోకుండా కొడుకుని పెంచుకుంటోంది- తనమంచితనంతో పందులకాపరి వూచియ-షునికూడా పెంచుతోంది.

దక్షిణ కొంగ్‌మీదకూచున్న పాయిభార్య చావోభార్యకి ఒకటోనంబరిచ్చి తీరాలంది।

"ఇలాటోల్లు నూటికొకరుంతారు"- అంటూ దీనికి అందరూ ఒప్పుకున్నారు- చావోభార్యకి ఒకటోనంబరు, చుకి రెండోనంబరు ఇచ్చేడు చైర్మన్- చు కొంగ్‌మీద కూచోబోతుంటే ఓల్డ్‌సన్ కొంగ్‌దిగి బట్టలమీది గింజలపొట్టు దులుపుకుంటూ గది మధ్యలోకొచ్చేడు- అతను నోరెత్తేలోపలే అందరూవెక్కిరించేరు.

"నీ నంబరుకోసరం లేసేవా?" అన్నాడు చు. అందరునవ్వేరు.

"మన బండోడు పులి- ఎలుగుబంటి కతసెప్తాడోయి !"

"కిందటేడు గుర్రం తీసుకోడానికే యీడికి దమ్ముల్లేవు- ఉప్పుడు మూడో నంబరు కోసఁవొచ్చేడు !"

"బండోల్లని, పడవోల్లని, సత్రపోల్లని, సామానుకూలోల్లని- అందరినీ కాల్చి పారెయ్యాల ! ఇదేటి, ఈడు మనకి పోటీనిల్చినాడు ?"

వాళ్ళ వేళాకోళాల్ని, వెక్కిరింతల్ని పట్టించుకోకుండా ఓల్డ్‌సన్ ఎడంకన్ను చికిలించి-

"మనం కువో చువాన్. హైని మర్చిపోరాదు- అతను మునుపు రైతుసంఘం వైస్‌చైర్మన్- తర్వాత పేదరైతుల, కంబార్ల లీగ్‌లీడర్- ఉప్పుడు రైతుసంగం చైర్మన్- అతను పనిమీదపైకిపోనాడు- చు మీద కువో వుండాలానేదా ?"

"కువో మన లీడరు- నానతనొక్కడి కొసరఁవే తగ్గుతా" నన్నాడు చు.

"ఖువో రెండోనెంబరు, చు మూడోనంబరు" అన్నారు చాలామంది.

తర్వాత ఉత్తరకాంగ్ పించి ఓ కుర్రాడు దిగేడు- అతనికి పద్నాలుగేళ్ళుంటాయి గాని ఎనిమిదేళ్ళ వాడిలాగున్నాడు- ఇతనే పందులకాపరి వూ.

"నాపేరు వూ చియా-ఫు- మా మూడు తరాలవోల్లు పేదరైతులే. నాను ఎనిమిదేల్లకాన్నించి ఆరోనంబరు హాన్ కాడ పందులకాపర్ని- పదమూడేళ్ళపుడు ఆడు నన్ను సావబాదేడు- ఆ మచ్చలింకావున్నాయి- సూపనా?" అనిచొక్కా విప్పబోయేడు.

"ఒద్దు, మాకందరికీ ఎరికే"

ఆ రక్తపుమడుగు, ఆరోనంబరు హాన్ పశుత్వం గుర్తొచ్చి అందరూ ఆ కుర్రాడి తరఫున మాటాడేరు.

"ఈడికి మూడోనంబరివ్వాల"

"నిజఁవే"

"ఈగుంటడంటే అందరికీ ఇష్టఁవే"

అందరు గొడవగా మాట్లాడుతుంటే చైర్మన్ పైపుతో బల్లమీదకొట్టి, "ఒల్ల కుండండి- 'వూ' మూడోనంబరు, 'చు' నాలుగో నంబరు- ఒప్పుకుంతారా?" అన్నాడు.

ఇంతలో పాయిభార్యలేచి ఆడవాళ్ళకేసితిరిగి, "అక్కల్లార! అత్తల్లార!"

"ఈవిడ ఆడోల్లకే సెప్తుందిగావాల- మొగోల్లం వూరుకోం" అన్నాడొకడు నవ్వుతూ.

"మనఁవెందుకు కుల్లుకోవాల"? అన్నాడు మరోడు.

"నోరుముయ్యండేస్- ఆవిడమాటఇనరాదా?"

పాయిభార్య, "మా యజమాని హాలాన్ పార్టీస్కూల్లో సదివేడు- ఉప్పుడు ఖువాంగ్ చెంగ్‌లో పనిసేత్తుండాడు- మంచుకోరోజుల్లో ఆడు తుమ్మమొద్దు- ఒక్క పనీసేసీవోడుకాదు- కాని బూసపుస్కరన కార్యకర్తలు ఒచ్చేక ఆడుశానామారిపోయేడు' అనిచెప్పింది.

"గొప్పలు కొట్టీసుకుంటన్నాది" అన్నాడొకడు.

"ఇది గొప్పలు కొట్టుకోడఁవెలాగౌతాది?" అంది పాయిభార్య కనుబొమలు ముడుస్తూ.

"నీ ముసిలోన్నిఅన్నా, నిన్నుకాదు" అన్నాడతను, నవ్వులాటగా.

"మద్దెనమీరేటి? ఆవిడసెప్పేది ఇనుకోండి" అన్నాడు చైర్మన్.

మునుపు మా యజమాని సైనికుడు- పుప్పుడు పోలీసు. ఆడికి తీరికనేదు- ఇల్లు గురించే పట్టదు" అంది పాయిభార్య.

"నిజఁవే పాయి శానాపనిసేత్తండాడు- మరి పాయిభార్య నేటంతారు?

ఆడవాళ్ళంతా ఒక్కటిగా అన్నారు.

"శానా మంచిది"

"కట్టపడి పనిసేత్తాది"

"పొలంపని, కుట్టుపని కూడా బాగాసేత్తాది"

"ఈవిడ మాటదురుసుగాని, మనసు ఎన్న" అన్నాడొకడు.

"పాయిభార్య పేదరైతు. మనం ముందస్తుగా రైతుకూలీల్ని సూడాల" అన్నారెవరో.

గ్రేడింగ్ నిర్ణయిస్తున్న సభ్యులంతా కలిసి ఆలోచించేరు.

"పేదరైతులు, రైతుకూలీలు ఒకేనాగున్నారు- ఒకలు గొప్పగా, ఒకలు తక్కువగానేరు- ఎవులు ముందుకొత్తే అల్లకి గ్రేడింగవుతాది- మీరంతా ఒప్పుకుంటే పాయిభార్యకి నాలుగోనంబరిద్దాం. ఏటంతారు? సరే, అదయిపోనాది- పాయిభార్య నాలుగోనంబరు, చు ఐదోనంబరు" అన్నారు గ్రేడింగ్ సభ్యులు.

చు పక్కనున్న రైతునవ్వి "పెతీనంబరుకి చు నంబరు దిగిపోతన్నాది- సివరకేడుంతాదో, ఏటో!" నన్నాడు.

తీన్‌తాతలేచి, "మనం మరోమనిసిని గురుతుంచుకోవాల- సైన్యంలో స్ట్రెచర్ల మోత్తాండాడు- ఉప్పుడే మంచుకొండమీదో దెబ్బతిన్నోల్లని మోత్తాండాల- ఆదే మన లీచాంగ్-యు, మనపెద్ద లీ- ఈ కమ్మరి అందరికెరికే- కిందటేడు మనం ఆరో నంబరు హాన్‌ని పట్టుకోవాలని సూత్తండాం, అల్లప్పుడు పెద్దలీ సైనికులకోసరం శానా ఈ బెలుసేసేడు- అడి పనెంతగొప్పదో, ఆడి మనసంత మంచిది" అని కూచున్నాడు.

"పెద్దలీకి అయిదోనంబరివ్వాల" అని చాలామంది అరిచేరు.

"చు ఆరోనంబరుకెల్లాల"

సియావో పక్కనున్న ఓమధ్యవయస్కుడు పైపు నేలమీదపెడుతూ, "తీన్‌తాతకి ఆరోనంబరివ్వాల- మంచుకోరోజుల్లో ఆడికూతురు సచ్చిపోనాది- ఆవిడక్కాబోయే మొగుడేడున్నాడో సెప్పమని హాన్ ఆఁవెని కొరడాతో బాదీసినాడు-

ఇప్లవంలో పనిసేసే అతని అనుపానులు ఆ పేదరాలు బయపెట్టనేదు- ఇప్లవంకోస రంవే సచ్చిపోనాది- మరి ఆంవె కన్నతండికి మనంసాయం సెయ్యంవా!" అనిఅడిగేడు.

అందరూ చప్పట్లు కొట్టేరు- తీన్‌తాత ఆరోనంబరు.. చు ఏడోనంబరు- ఇక ఓల్సన్.

"మన బండివాడు గొప్పపనులు చేయకపోయినా విప్లవంకోసం పాటుపడ్డాడు" అన్న సియావో మాటలు ఇందరూ ఒప్పుకున్నారు- ఓల్సన్‌కి ఎనిమిదోనంబరు.

లాంతరు వెలుగులో అందరి ముఖాలు ఆనందంగా వున్నాయి- కాని సియావో బల్లమీద ఓ మనిషి దిగాలుగా కూర్చున్నాడు- అతను నవ్వలేదు సరిగదా ఒక్క మాటన్నా ఆడలేదు.

సియావో అతన్ని పలకరించేడు- అతనే హౌ చాంగ్-షౌ, లేక పొడుగుకాళ్ళ హౌ అని తెల్సుకున్నాడు- అతను బలంగా అందరికన్నా రెట్టింపు పనిచేయగలవాడిగా వున్నాడు- అందుకే అతన్ని పనికి కుదుర్చుకోవడానికి కాంవందులు పుటలాటపడేవారు- అతనివయసు నలభైఆరు- కాని ఎందుకో అతన్నెవరూ పట్టించుకోలేదు- అతనుకూడా గ్రేడింగుకోసం ముందుకిపోలేదు.

"నువ్వూపోయి గ్రేడింగ్ చేయించుకోరాదా," అని సలహాయిచ్చేడు సియావో- కాని ఆపొడుగుమనిషి మారుపలకలేదు- సియావోకి వింతగాతోచింది- అసలు సంగతి మర్నాడు తెలిసింది.

(ఇంకా వున్నది)

---

# నవల 'కూలిగింజలు'

కుట్టనాడు (కేరళ) వ్యవసాయ కూలీలజీవితం ఇతివృత్తంగా రాయబడిన ఈ నవల మలయాళంలో 1948లో మొదట ప్రచురితమయింది.. చిరుత, కోరెన్, చాతన్‌ల జీవితం ప్రధానభూమికగా నడిచే ఈనవల మాల మాదిగకూలీల కష్టాలనూ, కడగండ్లనూ, 'ఆశలనూ, వైఫల్యాలనూ,' సంఘటితశక్తినీ, విజయాన్నీ ఒకతరం నుంచి ఇంకోతరం అందుకోవలసిన పోరాట సాంప్రదాయాన్ని అత్యంత ప్రతిభావంతంగా చూపుతుంది.

మామూలుగా చిరుత పెళ్ళిచూపుల ఘట్టంతో మొదలై చిరుతకొడుకు నిరుత్త 'దున్నేవాడికేభూమి'అని నినదించడంతో ముగిసే ఈనవల జీవితపు అన్నికోణాలనూ స్పృశిస్తుంది.

స్థూలంగా ఈ కథాకాలం 1945-55 అని నవలలోని కొన్నిసంఘటనలు చెపుతాయి- నాటి కేరళ పరయా(సూం) సాంప్రదాయంలో కన్యాశుల్కం అమల్లో వుండేది- ఇది చిన్నమొత్తాల్లోనే ఇప్పటికీ పరయాలకు భరించరానిదే- చిరుత పనినీ, అందాన్నీ చూసి తండ్రి వీలైనంత ఎక్కువఓలి సంపాదించాలనుకుంటున్నాడు- ఆ కారణంవల్ల చిరుతకు మూడునాలుగు సంబంధాలు తప్పిపోయాయి- చిట్టచివరికి క్రితం వరికోతలప్పుడు పక్కగుడిసెలో వుండిన కోరెన్‌కు చిరుతమీద మనసవుతుంది- కాళీ పరయన్ అడిగినంత ఓలిఇచ్చి చిరుతను చేసుకోవడానికి సిద్ధపడ్డాడ- చాతన్‌కూడా అందుకు సిద్ధపడ్డాడు- కానీ-ఇద్దరూ రెక్కలనే న(అ)మ్ముకొని బతికే పరయాలు- కాళీ అడిగిందేమో యాభై రూపాయలు, పదిహేనుపళ్ళధాన్యం! ఎంతకాలం సంపాదిస్తే కావాలి? ఇద్దరిమధ్యా పోటీ- ఎవరుముందు కాళీ అడిగినవి సంపాదించగలిగితే చిరుత వాళ్ళదవుతుంది- కోరెన్ వంశం తరతరాలనుంచి అరెక్కాళ్ దొరలదగ్గర పని చేస్తోంది- దొరను అప్పడిగి పెళ్ళి చేసుకుందామనుకున్నాడు కోరెన్- "అప్పు దొరకదని దొర ఖచ్చితంగా చెప్పాడు" ఇంకోదొరదగ్గర అప్పు తీసుకోవడానికి, అంటే జీతానికి కుదరడానికి అనుమతించాడు- పుష్పవేలిన్ జోసెఫ్‌దొర అప్పటికే అరడజను డీజిల్ పంపుసెట్లు వాడుతున్నవాడు- ఆ దొరపెట్టిన "అతికర్కశమైన" షరతులకు ఒప్పుకొని కోరెన్ ఆదొరదగ్గర కమతగాడుగాకుదిరి పెళ్ళికవసరమైన ధాన్యం, డబ్బు తీసుకున్నాడు- కన్నతండ్రికీ, మిగిలిన నా అన్నవాళ్ళందరికీదూరమై చిరుతను పెళ్ళి చేసుకున్నాడు- జోసెఫ్ దొరదగ్గర పనిలో సంఘచైతన్యం అబ్బింది- దొరదోపిడీ నుంచి, అణచివేతనుంచి కోరెన్ ఆలోచనలో ప్రతిఘటన నిప్పురవ్వ కుట్టనాడు

రైతుకూలిసంఘ ఆచరణలో దావానలమైంది. నిండుచూలాలైన చిరుతనొదిలి కోరెన్ అజ్ఞాతవాసం గడపవలసివచ్చింది. జైల్లోవున్నప్పుడు చాతన్ నూ చిరుతనూ పెళ్ళి చేసుకొమ్మని కోరాడు. చిరుత అందుకసలే ఒప్పుకోలేదు. కోరెన్ విడుదలైవచ్చే వరకూ వాళ్ళిద్దరూ అన్నా చెల్లెళ్ళలా వుంటారు. చివరికి కోరెన్, చిరుత మళ్ళీ కలుసుకుంటారు. చిరుత్త తనతండ్రి అందించినబాధ్యత నెరవేర్చడానికన్నట్టు 'దున్నేవాడికే భూమి'అనడంతో నవలముగుస్తుంది.

చిరుత, కోరెన్ లకు ఇద్దరికీ పెళ్ళికాగానే ఎన్నో ఆశలు. కాని "వేడిముద్దుల్లో వెచ్చని కావిలింతల్లో కరిగిపోయేమైనపు ముద్దలు కారువాళ్ళు".

అరసోలెడు బియ్యం ఉడకేసి పెట్టుకుంటే ఆ పేదరికంలోనూ దొంగలు. "ఖాళీ కుండ, చట్టి కంటికెదురుగా వెక్కిరిస్తూ దుఃఖాన్నీ కోపాన్నీ" కలిగించాయి. వ్యక్తుల మీదనే కోపమొచ్చిందిగానీ ఇది దొంగల వ్యవస్థని తెలియరాలేదు.

గ్రామాల్లో ఆర్థిక దోపిడీని వెన్నంటివచ్చేది సెక్స్ దోపిడీ. జోసెఫ్ కొడుకు చాకోకన్ను చిరుతమీదపడ్డది. "తలుపులు తాళాలులేని పూరిగుడిసెల్లో పడిని ద్రపోయే పేద మాదిగ పిల్లలు మానాన్ని కాచుకోవడం ఎట్లాసాధ్యం ?"

కోరెన్ తండ్రి చనిపోయాడు. పూడ్చిపెట్టడానికి ఎక్కడా ఆరడుగుల నేల లేదు। క్రైస్తవమతంలో చేరితే వాళ్ళ ప్రత్యేక శ్మశానంలో చోటిస్తారు. దానికి కోరెన్ ఒప్పుకోలేదు. రెక్కలు ముక్కలు చేసుకొని తన గుమ్మలునింపిన ఒకపరయాకు ఆరడుగుల నేల ఇవ్వడానికి దొర నిరాకరించాడు. ఇక కోరెన్ సాంఘిక కట్టుబాట్లని తోసేయదలిచాడు. శవాన్ని చాపలోచుట్టి బండకట్టి నదిలో వదిలివేశాడు. ఎంత హృదయ విదారకమైన దృశ్యమది।

—ఈ అన్ని సంఘటనలూ మెదడున్నవాడి జ్ఞానసంపదకు అవసరమైన ఆలోచనను నేర్పుతాయి. అదే జరిగింది పరయాల విషయంలో.

"యీ పరయాలు పులయాలు లేరనుకుందాం. అప్పుడు యీ సేద్యం ఎట్టా సాగుద్ది ?" మౌలికమైన ప్రశ్న ఉదయించింది. కాని వాళ్ళకింకా జవాబు తెలియదు. "మాలమాదిగ పనివాళ్ళు లేకపోతే కుట్టనాట మాగాణి వ్యవసాయం సాగదని" మాత్రం వాళ్ళు తెలుసుకున్నారు.

తరతరాలుగా తనవంశం జోసెఫ్ దొర దగ్గర పనిచేస్తున్నది గనుక తనకేవో ప్రత్యేక హక్కులున్నవనుకున్నాడు చెన్నడు. ఆ భ్రమలో కొంత మొండిగా

ప్రవర్తించాడు. దానికి దొర చెన్నడి కాలు విరగ్గొట్టాడు, పిల్లల్ని తన్ని తరిమేశాడు. "దొర తల్చుకుంటే దుర్మార్గానికి అడ్డేముంది!" ఐతే ఈ దుర్మార్గం ప్రతిక్రియ లేకుండాపోదు, కనీసం ఒక్క మెదడైనా రగిలింది. "దొర జీతగాణ్ని చావచితక తంతే ఏంచేయాలి? సక్రమంగా కూలియివ్వకపోతే ఏం చెయ్యాలి? పడుచు దొరలు ఆడ కూలీలవెంటబడి వేధిస్తే ఏం చేయాలి?" కొలిమంటుకుంది.

"మనుసులంతా ఒకటే అని ఒక దొర అన్నాడుగందా మరి, మనదొరలు మనం సమానమేనా?" "....సర్కారు మనకు కూలిచ్చేపని సేపట్టాలె" కొలిమి ఇంకా రాజుకుంటోంది. దొరలు స్వాతంత్ర్యప్పండుగ చేసుకుంటుంటే పరయా పులయాల ఆలోచన రెక్కవిప్పింది.

కానీ వాళ్ళకి తెలుసు- "పెద్దపెద్ద కబుర్లు చెప్పిన ఈ దొరలంతా మన దొరల యిళ్ళల్లో యిందులు కుడుస్తుంటారు."

ఈ సంభాషణ నుంచి వాళ్ళు అసలు విషయం తెలుసుకున్నారు. "డబ్బులు గింజలు వున్నోళ్ళంతా ఒక కులం. అవి లేనోళ్ళంతా వేరే కులం."

ఇంకెన్ని చిగుళ్ళు వేస్తేగాని ఈ ఆలోచనావృక్షం ఆచరణఫలాలు కాయాలి!

దొరల కొత్త ఆటలో కుట్యాప్ప పెట్రోక్ అయ్యాడు. మళ్ళీ మోహన్‌అనం, రన్ అయ్యాడు. "అయినా వాళ్ళరోజుకూలి రెండుసోలలు దాటి పైకిపెరగలేదు."

—ఇవన్నీ రగిలిరగిలి అగ్నిపర్వతం బద్దలయింది. స్వచ్ఛమైన, సారవంతమైన లావా పెల్లుబిగింది.

"అయ్యాబాబూ అని దేబిరిస్తే మనకు రావాల్సింది వొస్తదా? బలవంతంగా లాక్కుంటేగానిరాదు. దానికోసం జైలుకు పోవటానికి, లాఠీ దెబ్బలు తింటానికి, ఆఖరికి చావటానికి తయారై వుండాలి.

ఆ అనుభవమే మామూలు గృహిణి, నిండుచూలాలు చిరుత నెత్తురు ఉప్పొంగించింది- చాతన్‌ను పోరాటానికి పంపే చైతన్యాన్నిచ్చింది. కోరెన్ కొడుకును కాపాడవలసిన బాధ్యతపట్ల క్రమశిక్షణతో "ఆ బిడ్డ సంఘానికి ముకుటం అవుతాడు. నేను చచ్చిపోతే వాడూ చచ్చిపోతాడు" అని చాతన్ చేత అనిపించిందీ ఆ అనుభవమే.

ఇదంతా ఒక ఎత్తు. నవలమొత్తంలో 'సృష్టికర్తలైన' శ్రమజీవుల అంశం ఇంకో ఎత్తు.

వాళ్ళు నేలతల్లి బిడ్డలు— సమస్త సంపదకూ సృష్టికర్తలు, ఐనా పొద్దుట్నించి సాయంత్రిందాకా పనిచేస్తే అరసోలెడు బియ్యం ఉండవు. చచ్చిపోతే పూడ్చిపెట్టడానికి ఆరడుగుల నేల వుండదు.

మొత్తం వెయ్యిఎకరాల భూమిని ఆరుగురు కమత గాళ్ళకు కొంత కొంత బాగా లుగా ఒప్పజెప్పాడు దొర. "పనివాళ్ళ పోటాపోటీల పుణ్యమా అనిదొర పొలాలు రోజురోజుకూ పుంజుకుంటున్నాయి. పచ్చగా పైరు మెరిసిపడుతోంది. ఎన్ని కష్టాల కోర్చి యింత పంట పండించారు! ఎన్ని బాధలుపడ్డారు! రేయింబగళ్ళు ఎట్టా రెక్కలు ముక్కలుచేసుకున్నారు! ఆ చేతులు ఎన్ని వేల ఎకరాల వరి కోశాయి! ఎన్నివందల గుమ్ములు నింపాయి! అయితే మాత్రిం ఫలితం ఎవరిది?

దొరకూ జీతగానికీ మధ్యసంబంధం అర్థరూపాయిస్టాంపు పేపరుమీదరాసివుంది పొద్దున చద్దయినాతినక పనిలోదిగి సాయంత్రిం కల్లునీళ్ళకోసం రెండుకంకులు సంచిలోవేసుకుంటే దొరతిట్టి, అవమానించి కంకులు గుంజుకుంటాడు— దొంగ లెక్కలు వేస్తాడు— కూలీలరక్తం జుర్రుకుంటాడు.

భూమిబిడ్డలకళ్ళు ఈభూమి సమస్యతో తెరుచుకున్నాయి— పరయా తనహక్కులు తెలుసుకున్నాడు— "స్పృహ, చైతన్యం ఆగొంతులో, మాటల్లో నినదించాయి"— యింకా స్పష్టంగా వ్యక్తంకాని అతని ఆశయబలం ఆగొంతులో వినిపించింది.

పరయా కోరెన్ రైతుకూలి సంఘనాయకుడు కోరెన్‌గా పరిణామంచెందాడు— "పేద మాల మాదిగలమీద తరతరాలుగా ఛద్దిన— అమానుష అసమానతల్ని గురించి కోరెన్ ఆవేశంగా" మాట్లాడుతున్నాడు. నవలనిండా ఎక్కడా గట్టిగా నాలుగుమాటలు మాట్లాడని చాతన్ విశత్త పెద్దవాడుకాగానే "నాబాధ్యత తీరిపోయింది— పోరాటంలోకి పోతానం"టున్నాడు.

కోరెన్‌తండ్రి అంతిమఘడియలు, శవాన్ని నీళ్ళలో వదిలిపెట్టడం, కోరెన్ జైల్లోవుండి చాతన్‌కూ చిరుతకూ పెళ్ళిచేయడం, వాళ్ళిద్దరూ అన్నాచెల్లెళ్ళలా వుండడం, చాతన్ చిరుతను కంటికిరెప్పలా పదేళ్ళు కాపాడడం, చివరికి కోరెన్ విడుదలయ్యాక ఆమెను అతనికి అప్పగించడం— ఈ సెంటిమెంట్లన్నిటినీకూడా బలంగా జాగ్రత్తగా వుపయోగించుకోవడం ఈ నవలలో ఇంకొక ముఖ్యమైనఅంశం.

సహవాసి తేటతెలుగు మలయాళీ వాతావరణాన్ని మనకళ్ళకుకడుతుంది.

ఇంత మంచిపుస్తకాన్ని మలయాళంలో వెలువడ్డ 32 ఏళ్ళకయినా తెలుగులో అందించిన హైదరాబాద్ బుక్‌ట్రస్టుకీ, అనువదించిన సహవాసికీ అభినందనలు.

ఈ నవలలో ఒకముఖ్యమైన అచ్చుపొరపాటు 30 పేజీలో "అర్థాంతరంగా" అని పడేబదులు అర్థవంతంగా అనిపడింది.

క్రౌన్‌సైజులో 130 పేజీల (అదీ న్యూస్‌ప్రింట్‌లోవేసి) ఈ పుస్తకానికి రు. 4-50 పెట్టడం హైదరాబాద్ బుక్‌ట్రస్టులాంటి సంస్థకి భావ్యంకాదు.

శివశంకరపిళ్ళె మాటల్లోనే "వర్గపోరాటం ఒక విస్పష్టరూపంలో ఆవిర్భవించింది. అది అభివృద్ధవుతోంది. వర్గరహిత సమాజనిర్మాణదిశలో ఈ అభివృద్ధి జరుగుతోంది. ఆ అంతిమవిప్లవం యింకొంచెం దగ్గరవుతోంది".

— వి. జి.

---

కూలిగింజలు- నవల- మలయాళీమూలం : తక్కళి శివశంకరపిళ్ళై తెలుగు సహవాసి. ప్రచురణ : హైదరాబాద్ బుక్‌ట్రస్టు, హైదరాబాద్- 130 + *IV* పేజీలు వెల రు. 4-50 ప్రతులకు హైదరాబాద్ బుక్‌ట్రస్టు - 10-1-17/2, మొదటిఫ్లోరు, శ్యామ్‌నగర్, హైదరాబాద్- 500 004

---


# FORM IV

*(See Rule 8)*

| | | | |
|---|---|---|---|
| 1. | Place of publication | ... | Hanamkonda |
| 2. | Periodicity of its publication | ... | Monthly |
| 3. | Printer's Name | ... | P. Hemalatha |
| | Whether citizen of India | ... | Yes |
| | Address | ... | SRJANA<br>Hanamkonda 506 001 |
| 4. | Publisher's Name | ... | P. Hemalatha |
| | Whether citizen of India | ... | Yes |
| | Address | ... | (same as above) |
| 5. | Editor's Name | ... | P. Hemalatha |
| | Whether citizen of India | ... | Yes |
| | Address | ... | (same as above) |
| 6. | Name and addresses of individuals who own the newspaper and partners or share holders holding more than one per cent of the total capital. | | - NO - |

I, P. Hemalatha hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/- P. Hemalatha
*Publisher.*

చర్చ:

# మార్క్సిజం - సాహిత్యం

మార్క్సిజం-సాహిత్యం అనే శీర్షిక క్రింద రాస్తూ సురేంద్రరాజు[1] త్రిపురనేని మధుసూదనరావు వ్యాసం[2]లో లేని యాంత్రికత దానికాపాదించి, ఉత్తరోత్తరా దాన్ని మార్క్సిస్టు లందరికీ (మార్క్సును, ఎంగెల్సును మినహాయించి) సాధారణీకరించి, దాని ఆలంబనగా మార్క్సిస్టులందరినీ దుయ్యబట్టాడు. త్రిపురనేని వ్యాసంలో యాంత్రికత లేదని విపులంగా వివరించేకంటె, సురేంద్రరాజుకర్థమయిన గతితర్కం ఏమిటో చూడటం సరయిన పద్ధతి. ఆ క్రమంలోనే అతని ఆక్షేపణల నిజానిజాలు బయటపడతాయి.

'నిర్దిష్ట సామాజిక స్థితిగతులలోనే తన జీవన విధానం నిర్ణయించుకోగల స్వేచ్ఛ' వ్యక్తికి వున్నట్లు మార్క్సు అంగీకరించాడని, చరిత్రలో వ్యక్తిగత అంశానికి మార్క్సు ప్రాముఖ్యత వున్నట్లు చెప్పాడని, కళలకు భౌతిక వుత్పత్తికీ అసమానత మార్క్సు ఒప్పుకున్నాడని, అయితే వీటన్నింటినీ మార్క్సిస్టులు కాదంటున్నారన్నది సురేంద్ర రాజు ముఖ్యమయిన ఆరోపణ. అయితే ఈ 'స్వేచ్ఛ' గురించి, 'వ్యక్తిగత అంశం' గురించి, 'అసమానత' గురించి గతితార్కిక భౌతికవాదం ఏమంటున్నదో, వాటిని సురేంద్రరాజు ఏ విధంగా అర్థంచేసుకున్నారో చూడాలి.

మార్క్సిజం సమాజానికి పునాది భౌతిక వాస్తవమని, చైతన్యం కాదని నమ్ముతుంది. ఈ కారణంచేత బూర్జువా సామాజిక శాస్త్రంలాగ మార్క్సిస్టులు మనుషుల ప్రవర్తన గురించి, మనస్తత్వం గురించి, సూత్రీకరించలేదు. మనుషులందరు గూడ హేతుబద్ధంగానో లేక ఆర్థిక అవసరాలననుసరించో, లేక మరే ఒక్క ప్రేరణకు లోనయ్యో ప్రవర్తిస్తారని అనలేదు. ఫలానవ్యక్తి ఏ వర్గానికి చెందినవాడన్నది గూడ నిర్ణయాత్మక స్వభావాన్ని కలిగివుంటుందనలేదు. వర్గచైతన్యం అంటే ఆ వర్గంలో అందరికీ సాధారణంగా వుండే చైతన్యం అనికాదు. ఆర్థిక సంబంధాలలో ఆ వర్గానికున్న స్థానంనుండి సహజంగా పుట్టే చైతన్యం. కాని ప్రతిసందర్భంలోను, ప్రతి ఒక్కరిలోను ఈ చైతన్యానిదే పైచేయి కానక్కరలేదు.

మరి సమాజంలో మనుషుల కార్యాచరణ మాటకొస్తే, దానికి ప్రేరణ "ఆదర్శాలనుండి గాని, ఆశయాలనుండి గాని, 'సత్యాన్వేషణ, ధర్మాన్వేషణ'ల నుండిగాని, ద్వేషంనుండిగాని, మరే వ్యక్తిగతమయిన చాపల్యంనుండిగాని రావచ్చు" అని ఎంగెల్సు ఒకచోట అన్నాడు.[3] అంటే ఎంగెల్సు సురేంద్రరాజుకు రావలసినంత

'స్వేచ్ఛ' యిచ్చాడు. అయితే ఈ వైవిధ్యం నుండి, ఈ గందరగోళంనుండి వుత్పన్నమయే చరిత్ర సూత్రబద్ధంగా వుంటుంది. స్థూలంగా దాని పరిణామాన్ని వూహించడానికి వీలవుతుంది. భౌతికశాస్త్రంలో విభిన్నశక్తులు ఒకచోట కేంద్రీకరించబడ్డప్పుడు అవన్నీకలిసి వాటి ఫలితమైన ఒకే ఒకశక్తితో సమానమయిన ప్రభావాన్ని కలిగివుండడాన్ని ఎంగెల్స్ ఇక్కడ సామ్యంగా చెప్పాడు4. ఆధునికంగా చెప్పాలంటే పరమాణువులోని ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు నిర్ణయాత్మక గతిసూత్రాలకు లోబడకపోయినా వాటిచేత నిర్మించబడే పదార్థపు పరిణామసూత్రాలు గణిత సమీకరణ రూపం తీసుకొనేంతటి నిర్ణయాత్మకతను కలిగివుంటాయి. నిజానికి ఆధునిక భౌతికశాస్త్రం నుండి ఎంగెల్స్ ఇచ్చినటువంటి వుదాహరణలు చాల ఇవ్వవచ్చును.

కాబట్టి 'తన జీవన విధానం నిర్ణయించుకోగల స్వేచ్ఛ' వ్యక్తికి వుండాలంటే ప్రతివ్యక్తీ తనకది వుందనే అనుకుంటాడు. వ్యక్తిపరంగా చూస్తే అది నిజమే. కాని చరిత్రపరంగా చూస్తే భ్రమ. చరిత్రపరంగా (అంటే శాస్త్రీయంగా) చూస్తే 'తనయిష్ట ప్రకారం' నడుచుకునే వ్యక్తి ఏదో ఒక చారిత్రక శక్తికి, అంతిమంగా ఒక వర్గానికి, ప్రాతినిధ్యం వహిస్తాడు. బ్రిటిష్ హయాంలో ప్రతివ్యక్తికి పోలీసు వుద్యోగం చేయాలాలేదా అని నిర్ణయించుకునే స్వేచ్ఛవుండేది. కాని ఆ నిర్ణయం ఎంత వ్యక్తిగతమైన కారణంవల్ల తీసుకోవడం జరిగినా (ఉదాహరణకి, పోలీసు యూనిఫారం చూసి ముచ్చటపడ్డా) దాని అసలుస్వభావం బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ప్రాతినిధ్యం వహించడమా లేక ప్రజల పక్షానవుండడమా అన్నదే. అందులో మొదటిది చేస్తే దెబ్బతినడమూ తథ్యమే. కాబట్టి చారిత్రిక క్రమాన్ని అర్థంచేసుకొని ఆ అవగాహన ఆధారంగా తన ఆశయాలను సాధించుకోవడం సరయిన స్వేచ్ఛ. అందుకే 'ఆవశ్యకతను అంగీకరించడం స్వేచ్ఛ' అని ఎంగెల్స్ అన్నాడు. ఆకాశంలో విహరించదలచుకున్న వాడు విమానం ఎక్కాలన్న "నిర్బంధం" లేదు. అయిదంతస్తుల మేడ ఎక్కి అమాంతం గాలిలోనికెగిరవచ్చు. అయితే భౌతికవాస్తవాన్ని నిరసించే ఈ చర్యను మతిలేనివాళ్ళు తప్ప 'స్వేచ్ఛ' అనరు. సమాజ పరిణామంలో వ్యక్తుల కార్యాచరణకు గూడ ప్రాముఖ్యత యెక్కువేవుంది. వారి కార్యాచరణ వల్లనే సమాజం మారుతుంది. అయితే ఆ ఆచరణ సాఫల్యం పొందాలంటే అది సమాజం యొక్క గతిసూత్రాల ననుసరించి వుండాలి. లేకపోతే వూహించిందొకటయితే జరిగేది మరొకటి.

ఇదంతా మార్క్సిస్టులు కాదంటున్నారా? 'మనిషి పరిస్థితులకు బానిస' అంటున్నారా? చివరికి కమ్యూనిస్టు మానిఫెస్టోలో చెప్పినట్లు బూర్జువావర్గంనుండే

కొంతమంది, ముఖ్యంగా మేధావులు, శ్రామికవర్గంవైపు వస్తారన్నదిగూడ కాదంటున్నారా ? ఎవరినిగురించి సురేంద్రరాజు మాట్లాడుతున్నది ? ఎవరీ 'శాంతచిత్తులై' 'భద్రంగా ఎటువంటి తపనకు గురికాకుండ' కడుపులో చల్లకదలకుండ జీవిస్తున్న మార్క్సిస్టు రచయితలు ? వుద్యోగాలు పోగొట్టుకున్నవాళ్ళా, ఎమర్జన్సీ రోజులు జైళ్లలో గడిపినవాళ్ళానా ? 'వాస్తవం మారినప్పుడే చైతన్యం మారుతుంద'ని యాంత్రికంగా నమ్మినవాళ్లయితే రచయితలసంఘాలు. సాంస్కృతిక సంస్థలు, పార్టీలు పెట్టుకోవడం ఎందుకు ! ఇంతకీ 'తపన' అంటే సురేంద్రరాజు వుద్దేశ్యంలో యిదంతాకాదు. మార్క్సిస్టు రచయితలు పోలీసులాఠీలు- సుబ్బారావు పాణిగ్రాహి, సరోజదత్తాలలాగ పోలీసు గోలీలు ఎదుర్కొన్నారన్నది అతనికనవసరం. వాళ్ల ప్రపంచాన్ని చూసి 'ఆందోళనతో, కసితో, కాల్చివేసేతపనతో, దుఃఖంతో, నిరాశతో' దేవదాసుఫక్కీలో మనోవేదన పొందడం లేదన్నది అతనిఆరోపణ.

ఇక, కళకూ భౌతికఉత్పత్తి (విధానాని)కీ గల "అసమానత" ఉపరితలంలో ఒక భాగమయిన కళలు, మొత్తం ఉపరితలంలాగే పునాది మారినంత సులభంగామారవు. అంటే కొంచెం వెనకబడివుండే అవకాశంవుంది. మరొకసందర్భంలో మార్క్స్ "గతం మనుష్యుల మనస్సునొక పీడకలలాగ ఆవరించి వుంటుంద"న్నాడు.[5] అంతే గాని ఉపరితలఅంశాలు "ఆనాటిసామాజిక పరిస్థితులను అధిగమించి వుంటాయ"నడం ఆశ్చర్యకరం. పైగా దీనికిచ్చిన వుదాహరణ : "జర్మనీలో పెట్టుబడిదారీ విధానం ప్రవేశించకముందే పెట్టుబడిదారి సమాజంకన్న ఉన్నతమయిన సామ్యవాద సమాజాన్ని గూర్చిన సిద్ధాంతాలు తత్వశాస్త్రంలో ప్రవేశించడం (మార్క్స్)" ఇదిమరీ ఆశ్చర్యకరం. మార్క్స్ జీవితకాలంలో పెట్టుబడిదారీ విధానం జర్మనీలో లేదా ? ఒక వేళ లేదనుకున్నా మార్క్స్ జర్మన్ దేశస్తుడయిన పాపానికి ఆ సమాజవాస్తవానికే స్పందించాలా ? పెట్టుబడిదారి సమాజం పుట్టుకనుండి అంతర్జాతీయ స్వభావం కలిగి వుంది. ఆనాటికి ఇంగ్లండ్‌లో పెట్టుబడిదారీ విధానం సంపూర్ణంగా విస్తరించివుంది. జర్మనీలోగూడ బూర్జువావర్గం అప్పటికి రాజ్యాధికారాన్ని సంపూర్ణంగా చేజిక్కించుకోలేదుగాని, బూర్జువా ఆర్థిక సంబంధాలు బాగావిస్తరించాయి. ఈ తప్పుడు ఉదాహరణ ఆధారంగా తప్పుడుసూత్రీకరణచేసి సురేంద్రరాజు సాధించింది ఏమిటంటే : "తప్పని సరిగ సామాజిక సంబంధాల నధిగమించే ప్రయత్నంచేస్తుంది సాహిత్యం." మరొక చోట "ఆచరణ తత్వశాస్త్రంలో ఆలోచనలు, కల్పనాశక్తి ప్రాథమికం", "తాత్వికుడు, కవి ముందుగా కల్పిస్తేనే తర్వాత సమాజంలో ఆకృతి తీసుకోవడం జరుగుతుంది." సమాజ పరిణామంలో వ్యక్తిగత అంశాన్నీ, పునాది ఉపరితలాల అసమాన అభివృద్ధిని,

సురేంద్రరాజు అర్థంచేసుకున్నది ఈవిధంగా. దీనిని భౌతికవాదం అంటారా? దీనికంతటికీ ఆధారంగా చెప్పిన మార్క్స్ మాటలు: "భౌతికవాద సిద్ధాంతం (ఇక్కడ మార్క్స్ అధిభౌతికవాదం గురించి మాట్లాడుతున్నాడు) మారేపరిస్థితుల గురించి విద్యనుగురించి వివరించేటప్పుడు పరిస్థితుల్ని మార్చేది మనుష్యులేనని.... మర్చిపోయింది." తరువాత "శిల్పకారుడు.... తానునిర్మించబోయే కట్టడాన్ని ముందుగానే తనకల్పనలో చిత్రిస్తాడు. శ్రమచివర శ్రామికుడు తాను ముందుగా వూహించినదానినే పొందుతాడు". ఈ మాటలుచెప్పి "ప్రపంచాన్ని, బాహ్యవాస్తవికతని (విషయాన్ని) మార్చేవ్యక్తి ఈవిధంగా ముందుగానే తాను మార్చబోతున్న వాస్తవికతను గురించిన జ్ఞానాన్ని కలిగివుంటాడు" అంటే ఎవరికీ అభ్యంతరంలేదు. కాని ఆ వూహ, ఆ జ్ఞానం అతనికెక్కడినుంచి వచ్చింది? 'సామాజిక సంబంధాలను అధిగమించడం' వల్లనా? ఇది భావవాదంకాదూ?

భవిష్యత్తు వర్తమానంలోని వైరుధ్యాలనుండి పుడుతుంది. అంటే వర్తమానంలోని ప్రధాన వైరుధ్యంలో ఒకఅంశం (ఒకధ్రువం) భవిష్యద్వాస్తవానికి బీజంగా వుంటుంది. ఈ అంకురరూపంలోని భవిష్యద్వాస్తవానికి ప్రతిబింబంగా దాన్ని గురించిన 'వూహ' గూడ వర్తమానంలోనే వుంటుంది. పెట్టుబడిదారీ సమాజంలో స్వంతఆస్తికీ సామాజికమయిన వుత్పత్తికీగల వైరుధ్యంలో రెండవఅంశం, అంటే వర్గపరంగా చెప్పాలంటే కార్మికవర్గం, సామ్యవాదానికి బీజంగావుంటుంది. దాని ప్రతిబింబంగానే సామ్యవాదాన్ని గురించిన 'వూహ'. "సామ్యవాదం ఒక శక్తికావాలంటే అది కార్మికవర్గ రాజకీయోద్యమంయొక్క ఆశయంకావాల"ని లెనిన్‌చెప్పాడు.[6] అంతేకాని సామాజిక సంబంధాల నధిగమించే సాహిత్యకారులు, తాత్వికులు చేసే ఊహ కాదు సామ్యవాదం.

ఇది అర్థంకాకపోబట్టే "వాస్తవం మారితేనేగాని చైతన్యం మారదు" అన్న త్రిపురనేని మాటకు "ఆ వాస్తవాన్ని మార్చడానికి అవసరమయిన చైతన్యమయినా కావాలి గదా!" అని చాల తెలివిగా సమాధానం చెప్పారు రేపటి వాస్తవం అంకురరూపంలో ఈనాటి వాస్తవం గర్భంలోవుంటుంది కాబట్టి దానికనుగుణమయిన చైతన్యం గూడ ఆ మేరకువుంటుంది. అయితే ఆ చైతన్యం సంపూర్ణంగా వికసించాలంటే బీజరూపంలోని రేపటి వాస్తవానికి సంపూర్ణమయిన అస్తిత్వం చేకూరాలి.

## సురేంద్రరాజు ప్రపంచం

సురేంద్రరాజుకున్న తక్కిన అపోహలకు సమాధానం చెప్పాలంటే మొదట అతని ప్రాపంచిక దృక్పథం ఎటువంటిదో చూడాలి. అసలీప్రపంచం చాల వింత

యినది. ఇందులో పాలకవర్గాలుంటాయిగాని శ్రామికవర్గం వుండదు. మార్క్సిజం ప్రకారం దోపిడీవర్గం పాలకవర్గంగా వుంటుందిగానీ, సురేంద్రరాజు ప్రపంచంలోని పాలకవర్గం దోపిడీచేసేట్టు కనబడదు. అది సాంస్కృతికంగా మాత్రం ప్రజల్ని నిర్వీర్యం చేస్తుంది. ఈ పీడనకు గురయ్యేది శ్రామికుడుకాదు, పూరా పేరూలేని 'వ్యక్తి.' దానినెదుర్కొనేది గూడ ఒక వర్గంకాదు, విశిష్టులయిన వ్యక్తులు. వీళ్లు "సాహిత్యాధ్యయనం చేసినవాళ్లు, లేదా తాత్వికరచనల్ని చదివినవాళ్లు. సరయిన రాజకీయలవగాహనగలవాళ్లు." వీళ్లు ప్రజల్ని వెలుగులోనికి రప్పించడానికి "ఉత్తమ సాహిత్యాన్ని కళల్ని సృజిస్తారు." వీళ్లు సృష్టించే 'నిజమయిన సాహిత్యం' సదరు 'వ్యక్తి'ని "చైతన్యవంతమయిన కార్యాచరణకు ప్రోత్సహించి, వ్యవస్థకు వ్యతిరేకంగా మారుస్తుంది".

ఈ ప్రపంచంలోని పాలకవర్గాలు, వారి భావాలు యెటువంటివి? "ఆనాడు ప్రచారంలోవున్న పాలకవర్గభావాలు మనిషిని అంధుడిగా, వెధవగా, సామాన్యుడిగా మారుస్తాయి." ఇది యే వాస్తవ ప్రపంచంలో జరుగుతుంది? పాలకవర్గాలకేంకావాలి? దోపిడీ నిరంతరాయంగా సాగటం. పాలకవర్గభావాలు దానికి అనుగుణంగా పని చేస్తాయి. ఇది తప్పనిసరిగ మనుష్యుల్ని 'అంధులుగా వెధవలుగా సామాన్యులుగా' మార్చడంవల్ల సమకూరుతుందా? పూర్తిగా పతనమయిన భూస్వామ్య వ్యవస్థలో అది నిజంకావచ్చు– ఆ వ్యవస్థ 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' నన్నట్లు పడివుంటుంది కాబట్టి. కాని పెట్టుబడిదారీ వ్యవస్థ, ఎంత పతనమయినప్పటికీ, నిరంతరం పెట్టుబడిని విస్తరించుకుంటూ,7 వైరుధ్యాల పరిమితిలో ఉత్పత్తిశక్తుల్ని విప్లవీకరించుకుంటూ 8 పోతుంది. అటువంటి వ్యవస్థకు కావలసింది అంధులూ వెధవలూ సామాన్యులూ కాదు. ఒక 'విశిష్టమయిన' దృక్పథంగలవాళ్లు, చాలతెలివయినవాళ్లు, సమర్థవంతులూ కావాలి. వైజ్ఞానిక పరిశోధనా కేంద్రాలు, వాణిజ్యసంస్థలూ కావాలి. ఆధునిక యంత్రాంగంతో పనిచేసే నైపుణ్యంగల కార్మికులు కావాలి. ఆధునిక పరిశోధనాసాధనాల సాయంతో తిరుగుబాటును అణచే సామర్థ్యంగల పోలీసు ఉద్యోగులు కావాలి, దీనిని తెలివిగా సమర్థించే రచయితలు, మేధావులు కావాలి. 'అంధులూ వెధవలూ సామాన్యులూ' ఈ పనులన్నీ చేయలేరు.

మరి ఈ పాలకవర్గ భావాలను ప్రచారంచేసేది యెవరు? "ఏయుగంలోనయినా ఆనాటి పాలకవర్గాల భావాలే ప్రబలంగా వుంటాయి" అన్న మార్క్స్ సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ సురేంద్రరాజు "ఏ ప్రభుత్వమయినా మేధావుల్ని పోషిస్తుంది గనుక

ఆనాటి పాలకవర్గాల తొత్తులగావుండే రచయితలు, కవులు పాలకవర్గాల భావాలనే సరియైన భావాలగా ప్రచారంచేస్తారు" అంటున్నారు. మన దేశంలో పాలకవర్గ భావాలను ప్రచారంచేసే కవులు, రచయితలు ప్రభుత్వంచేత పోషించబడేవాళ్లా? అది నిజమయినంత మేరకు వారాపని చేయడానికి అదేనా కారణం? ఇతరులను యాంత్రిక భౌతికవాదులనే సురేంద్రరాజుకిది ఉద్రి భౌతికవాదంగా కనిపించలేదా? ఒక పాలక వర్గానికి దాని రాజకీయ సాంస్కృతిక ప్రతినిధులకున్న సంబంధం అంతనీచమయినదా? అయినదానికి కానిదానికి మార్క్స్‌చేత మాట్లాడించడం మామూలయిపోయింది కాబట్టి నేనూ ఆపనే చేస్తాను. 'లూయీ బోనపార్టె' వ్యాసంలో ఈ విషయం గురించి మార్క్స్ ఈ విధంగా అన్నాడు[9]. ఒక వర్గం తన భౌతిక అవసరాలదృష్ట్యా, సామాజికస్థానందృష్ట్యా ఏ పరిమితులకయితే లోబడివుంటుందో, ఏ సమస్యలనెదుర్కుంటుందో, ఏ పరిష్కారాల నాశ్రయిస్తుందో, తన ఆలోచనలో ఆ పరిమితులకు, ఆ సమస్యలకు ఆ పరిష్కారాలకు లోబడేవాడు ఆ వర్గం యొక్క రాజకీయ, సాంస్కృతిక, ప్రతినిధి.

అంతేకాని, ప్రభుత్వోద్యోగులు కావడంచేత పాలకవర్గాల తొత్తులు కాలేదు.

పాలకవర్గాలు, వారిప్రతినిధులు ఇలాగుంటే, ప్రజలమాటేమిటి? ఈప్రజలు (కొందరు విశిష్టవ్యక్తుల్ని మినహాయించి) 'అంధులు వెధవలు సామాన్యులు' అని ఇదివరకే చూసాం. అంతేకాదు వీళ్లలో "అధికజనాభా అజ్ఞానంలో చీకటిలో సంఘాన్ని సాంప్రదాయాల్ని ప్రశ్నించనయినా ప్రశ్నించకుండ తమజీవితాల్ని గడుపుతుంటారు". ఇంకా "మనిషి కృత్రిమవిలువల్ని పాటించేవాడుగా, పరాధీనుడుగా, ఒక శకలంగా, ఏకాకిగా, అసాహిత్యాన్ని నీచసంస్కృతిని ఆనందించేవాడుగా" మారతాడు. "పాలక వర్గాల భావాలు సాంస్కృతికరూపాల్లో ప్రచారం చేయబడతాయి గనక విచక్షణ, వివేచనలేని సామాన్యులు అర్థరహితంగా సారహీనమయిన జీవితాల్ని గడుపుతుంటారు". వీరికి నిరుద్యోగసమస్య, వేశ్యావృత్తి సమాజంలో వున్నట్లు తెలుసు. కాని వాటికి వ్యతిరేకంగా పోరాడ్డం అలావుంచి వాటిని వినియోగించుకుంటారు. ఉద్యోగంకోసం లంచమిస్తారు, తమకామాన్ని చల్లార్చుకోవడంకోసం వేశ్యల్ని ఆశ్రయిస్తారు (శివ శివా!)

సురేంద్రరాజుకు 1974లో దేశపాలక వర్గాలను హడలెత్తించిన రైల్వే కార్మికుడు 'ఏకాకిగా, శకలంగా, పరాధీనుడిగా' కనబడ్డాడా? పల్లెపల్లెలో తరతరాల నుండి వస్తున్న వెట్టిచాకిరీవంటి దోపిడీ రూపాలను ఎదిరిస్తున్న ప్రజలు 'అజ్ఞానంలో చీకటిలో సంఘాన్ని సాంప్రదాయాల్ని ప్రశించనయినా ప్రశ్నించని' వాళ్లగా కనబడుతున్నారా? ఈ రకమయిన నిస్తేజం లిగించడానికి పాలకవర్గం కప్రయత్నిస్తుందనడం

ఒకయెత్తు. కాని దానికి సహజంగానేవుండే ప్రతిఘటనను, శ్రామికవర్గ సంస్కృతిని- అది ఎంత అస్పష్టంగా వుండనీ- విస్మరించడంమాత్రం క్షమార్హంకాదు. ఇంతకీ ఈ పెట్టుబడిదారీ వ్యతిరేకత శ్రామికవర్గంపట్లవున్న ఏహ్యభావానికి ముసుగు మాత్రమే. ఈరోజు శ్రామికవర్గాన్ని బాహాటంగా అసహ్యించుకోవడం వీలుపడదుగనక, వ్యవస్థ మీదపెట్టి అపనిచేయడానికే ఇదంతా.

ప్రజలిలా ఏడిస్తే మరి ఈ విశిష్టవ్యక్తులెలాంటివాళ్లు? వీళ్లకొక వర్గం లేదు. వీళ్లు భౌతికవైరుధ్యాలకు స్పందించి పాలకవర్గాలనెదిరించే వాళ్లుకారు. అసలు సురేంద్రరాజు వుద్దేశ్యంలో ఒక వ్యక్తి విప్లవకారుడు కావాలనుకోవడం సమాజంపట్ల, తోటి మానవునిపట్ల అతనికున్న నైతికబాధ్యతను మాత్రమే సూచిస్తుంది. ఇది మార్క్సిజానికి పూర్తిగా విరుద్ధం. విప్లవభావాలు భౌతిక వైరుధ్యాలనుండి పుడతాయి. విప్లవ వర్గం పాలకవర్గంతో మౌలికమయిన వైరుధ్యంగలవర్గం. ఇక్కడ నైతిక బాధ్యత ప్రసక్తి అనవసరం. తాను దున్నుతున్న భూమిలోని పంట తనకే దక్కాలన్న కోర్కెలో 'నైతికబాధ్యత' లేదు. అది కేవలం 'స్వార్థమే'.

దీనికి భిన్నంగా ఈ విశిష్టవ్యక్తులు "పాలకవర్గాల భావాల నాశ్రయించకుండ జీవితాన్ని గడపగలిగేవాళ్లు." ఉద్యోగం కోసం లంచం యివ్వడంవంటి "సంఘం ఆమోదించేపనుల్ని విరోధించి" జీవించేవాళ్లు (వీళ్లకి పదెకరాల మాగాణి వుంటుంది కాబోలు) ఈ రకంగా పాలకవర్గ భావజాలం నుండి విముక్తిపొందడానికి వారికి సాహిత్యం తోడ్పడుతుంది. ఇది ఇదివరకు చెప్పిన 'నిజమయిన' సాహిత్యం. చరిత్రలో వ్యక్తిగత అంశానికి గల ప్రాముఖ్యత, సాహిత్యానికి ఉత్పత్తికి గల అసమానత మార్క్సిజాన్ని దాటి ఎంతదూరం వచ్చాయో గమనించాలి. ఉదాహరణకి: "సంఘాన్ని వ్యతిరేకించాలా లేదా అన్నది వ్యక్తినిష్ఠం. ఆ వ్యక్తి సాహిత్యపఠనం వల్లో, సరయిన సాంఘిక అవగాహనవల్లనో నిజానిజాల్ని తెల్సుకొని బాధ్యతాయుతుడు కావల్సిందే తప్ప వేరుమార్గం లేదు". వ్యతిరేకించేది 'సంఘాన్నా'? ఈ తిరుగుబాటుదార్లు బౌద్ధభిక్షువులా? తన జీవితనిత్యసత్యమయిన దోపిడిని అర్థంచేసుకోవడానికి ఒక కార్మికుడికయినా రైతుకయినా సాహిత్యపఠనం, సంపూర్ణ సామాజిక అవగాహన, తోడ్పడతాయిగాని అవి అత్యవసరం కాదు. ఇంతకీ శ్రామిక జనం పనికిరానివాళ్లని విప్లవం విశిష్టవ్యక్తులు విశిష్టంగా సాధించేదనీ చెప్పడానికే యిదంతా.

పోనీ యిదంతా నిజమేననుకున్నా ఈ సాహిత్యకారులు ప్రజల్ని మేల్కొలపడానికి ప్రయత్నంచేయాలా? తన వ్యాసం మొదట్లో ఒకచోట సురేంద్రరాజు అవుననే

అంటాడు. కాని ఉత్తరోత్తరా అసలు విషయం బయటపడుతుంది. "ఉత్తమ సాహిత్యాన్ని, కళల్ని ఆనందించగలశక్తి వారికి (అంటే సామాన్య ప్రజలకు) వుండదు. అయితే ఎంతటి ప్రతికూల పరిస్థితులలోనయినా ఎవరో కొందరు పాఠకు లుంటారు కనుక వారికోసం నిజమయిన సాహిత్యం ఉత్పత్తి అవుతుంది." దీన్ని సమర్థించుకోవడానికి మార్క్సను ఉపయోగించుకున్న విధం చాల ఆశ్చర్యకరం. మార్క్స్, ఉత్పత్తిచేయబడ్డ వస్తువును ఏవిధంగా వుపయోగించాలన్నది ఉత్పత్తే నిర్ణయిస్తుందని, కళకు సాహిత్యానికి సంబంధించిన వుత్పత్తి ఆనందించగల పాఠకుల్ని సృష్టించుకుంటుందని అన్నాడని చెప్పి, దాని నుండి "దీన్నిబట్టి ఏంతెలుస్తుందంటే రచయిత తన రచనను ఉత్పత్తి చేస్తేతప్ప రచనను అర్థంచేసుకోగల, ఆనందించగల పాఠకులు సిద్ధంకార"ని నిర్ధారణచేసారు. ఆపైన 'అధునిక క్లిష్ట రచనలను', 'అస్పష్టప్రయోగాలను', నిరసించి 'ప్రజల స్థాయినిబట్టి కవిత్వం రాయమనే' అభ్యు దయ రచయితల మీద విప్లవ రచయితల మీద 'ఎంత మోసం!' అంటూ విరుచుకు పడ్డారు అసలింతకీ అక్కడ మార్క్స్ ఏమన్నాడు.

--- "An object of art creates a public that has artistic taste and is able to enjoy beauty". అంటే మార్క్స్ ఇక్కడ కేవలం సౌందర్య సృష్టిని ధ్యేయంగాగల కళనుగురించి, అంటే పాశ్చాత్యదేశాల్లో అప్పటికి రెండుమూడు శతాబ్దాలుగా సాంప్రదాయంగా వస్తున్న కళనుగురించి మాట్లాడుతున్నాడు. కళా సౌందర్యం సృష్టికోసమేనని మార్క్స్ ఎన్నడూ అనలేదుకాబట్టి ఈ మాటనొక సాధారణ సూత్రీకరణగా వుపయోగించడం తప్పు. అయినా, మొదటి శ్రామికవర్గ విప్లవమయిన ప్యారిస్ కమ్యూన్ కూడ జరుగకముందు మార్క్స్ అన్నమాటల్ని వేద వాక్కుగా పరిగణించి ఈ విప్లవయుగానికిగూడ అన్వయించడం ఎందుకు? లేనిచోట యాంత్రికం కనిపించే సురేంద్రరాజుకిది యాంత్రికమనిపించలేదా? అదేవిధంగా, జంతువు తన తక్షణ అవసరాలననుసరించి ఉత్పత్తిచేస్తుందని మనిషి తక్షణఅవసరం లేనప్పుడుకూడ వుత్పత్తి చేస్తాడని, నిజానికి భౌతిక అవసరాల ఒత్తిడిలేనప్పుడే వుత్పత్తి చేస్తాడని మార్క్సంటే దాన్ని ఆధారంచేసుకొని "దీన్నిబట్టి భౌతికావసరాలకు అతీతంగా దృష్టి నిలుపగలిగినవాడు మాత్రమే సాహిత్యాన్ని సృష్టించగలడు. భౌతి కావసరాల పరిధిలో జీవించేమనిషి కళల్ని అందుకే ఆనందించలేడు" అనడం వక్రీకరణ అనాలో, వంచన అనాలో తెలియడంలేదు. జంతువులు ఆకలి వేసినప్పుడు తిండివెతుక్కుంటాయి. పక్షులు అవసరం అయినప్పుడు గూళ్లు కట్టుకుంటాయి. మనిషి రేపటి అవసరాన్నిదృష్టిలోవుంచుకొని ఈరోజే వుత్పత్తి చేసుకుంటాడు. ఆవిధంగా

చేయగలడు కాబట్టి, తన భౌతికావసరాలు తీర్చుకునేవేళను వుత్పత్తి చేసేవేళను వేరుగా వుంచుకుంటాడు. దానివల్ల ఉత్పత్తి మరింత సవ్యంగా చేయగలుగుతాడు. ఇదిమార్క్స్ అన్నది. అంతేకాని సాహిత్యకారులు పాఠకులు జితేంద్రియులు కావాలనికాదు. ఆ కారణంచేత సామాన్యులు వెధవలు సంస్కారహీనులు అయిన శ్రామికజనం సాహిత్యానికి అర్హులుకారని ఏమాత్రంకాదు.

ఇకపోతే, ప్రజలకోసం కవిత్వం రాయమంటే ప్రజలస్థాయినిబట్టి రాయడం కాదు. ఈస్థాయి అచలంగా ఎక్కడో వుండేదికాదు. ప్రజాసాహిత్యం, ప్రజాపోరాటం, ప్రజల చైతన్యస్థాయి, పరస్పరం ప్రభావితం చేసుకుంటు అన్యోన్యక్రియ ద్వారా ముందుకుపోతాయి, అంతేకాని, ఈ అన్యోన్యక్రియను 'ఉత్తమ సాహిత్యాన్ని ఆనందించగల' పాఠకుడికి, వాడికోసం రాసే రచయితకు మాత్రమే పరిమితంచేసి, రచయిత ఈ విశిష్టుడయిన పాఠకుడిని ప్రభావితం జేసి, తిరిగి ఆ పాఠకుడి 'మాతృభావాలతో, గ్రహణశక్తితో' ప్రభావితుడై, ఇద్దరూ చెట్ట పట్టాలేసుకొని సాహిత్యాకాశంలో విహరించడంకాదు మార్క్సిస్టు దృక్పథంఅంటే. ప్రజాసాహిత్యానికి ప్రజాపోరాటానికిగల అన్యోన్యక్రియ ఈనాడు సూత్రస్థాయి నుండి వాస్తవస్థాయిని చేరుకుంది. బూతుపత్రికలను, సినిమాపత్రికలను, మీ (మా) పత్రికలను చదవని శ్రామికజనం ఈరోజు విప్లవరచయితల కవితలు చదువుతున్నారు, పాటలు పాడుకుంటున్నారు, తామే రాస్తున్నారు కూడ.

వాస్తవం ఇలాగుంటే సురేంద్రరాజు దృష్టిలో ఇవ్వాళీ మార్క్సిస్టురచయిత తోటిమానవుడికోసం కాకుండా తన ప్రాపంచిక దృక్పథానికి మాత్రమే నిబద్ధుడవు తున్నాడట. అదేనిజమయితే విప్లవకవిత్వం అదనపు విలువగురించి పెట్టుబడిగురించి రాస్తూవుండాలి. మహాఅయితే మార్క్సుగురించి లెనిన్‌గురించి వుండాలి. కాని భాగల్పూర్ గురించి, సిరిసిల్ల జగిత్యాలలగురించి ఎందుకు రాస్తున్నారు? ఈఆరోపణ సురేంద్రరాజు వ్యాసం మూడవభాగంలోవుంది. ఆసంచిక (డిసెంబరు 1980) అట్ట మీదే 'కనువిప్పు'అనే కవితవుంది. 'వాస్తవాన్ని నగ్నంగా, ఏ ఆచ్ఛాదనలేకుండ స్వీకరించే స్థైర్యం' వున్నది. విప్లవకవులకో లేక ఆవాస్తవం తనలోసృష్టించే 'ఆందోళనను, కసిని, కాల్చివేసే తపనను, దుఃఖాన్ని, నిరాశనూ' ఆనందంతో స్వీకరించే సున్నితుడయిన వ్యక్తికో? అయినా, ఆందోళన, కసి, దుఃఖం వగైరా భావాలను కలిగించే వాస్తవాన్ని కోపంతో స్వీకరించాలిగాని, ఆనందంతో స్వీకరించడంఏమిటి? అదేమిటో ఎందుకో మార్క్స్ చాలకాలంక్రిందే చెప్పాడు. ఒక మిత్రుడికి రాసిన వుత్తరంలో "ఈ రకమయిన పెటీబూర్జువాలు వైరుధ్యాలను ఆరాధిస్తారు. ఎందుచేత

# "షహీద్" భగత్‌సింగ్ - ఉద్యమమూ - అవగాహనా

## 50వ వర్ధంతి సంస్మరణ - రెండు పుస్తకాలు పరిశీలన

- ముదార్ వేణు

## 1. భారతదేశ సాయుధ విప్లవ పోరాటచరిత్ర సింహావలోకనం

- యశ్‌పాల్

గాంధీజీ అహింసాతత్వం కేవలం బూటకమని, అతని నాయకత్వంలో కాంగ్రెస్ వారు నిర్వహించే సత్యాగ్రహాలు, సహాయ నిరాకరణలు పిరికి చర్యలని ఎలుగెత్తి చాటి, ఈ దేశం స్వాతంత్ర్యం పొందడానికి సాయుధ పోరాటమొక్కటే మార్గమని మనసానమ్మి, రష్యన్ విప్లవ విజయంతో ప్రభావితులైన భగత్సింగ్, రాజగురు, సుఖదేవ్ మొదలైన యువకిశోరాలు ఆనాటి బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో తీవ్రంగా జరిపిన పోరాటం మనకు మన దేశంలో ఏ చరిత్రా చెప్పదు.

ఆనాడు భగత్సింగ్ అసెంబ్లీలో బాంబులు పేల్చి, కరపత్రాలు వెదజల్లి నిద్రలో కూరుకుపోయిన జాతికి పాడిన మేల్కొలుపులు మనకీ దేశచరిత్ర లేపీ వినిపించవు.

సాయుధ పోరాటాన్ని తమ మార్గంగా ఎంచుకొని, సామ్యవాద ఆశయసాధనలో తుదివరకు రాజీలేని పోరాటంచేసి, తమ ప్రాణాల్ని తృణప్రాయంగా తలచి, చిరునవ్వుతో ఉరికంబాల కెక్కిన మహోన్నత విప్లవకారుల్ని మన చరిత్రకారులు, మన నేటి కుహనా రాజకీయ నాయకులు 'టెర్రరిస్టులు'గా (దౌర్జన్య కారులుగా) వక్రీకరిస్తున్నారు.

అప్పటి ఆ సాయుధ విప్లవ పోరాటాల్లో భగత్సింగు సహచరులుగా వుంటూ, విప్లవ సంఘ కార్యక్రమాల్లో పాలుపంచుకొంటూ, చివరికి ఒకానొక బనాయింపు కేసులో జీవిత ఖైదుననుభవించిన హిందీ సాహితీవేత్త యశ్‌పాల్ రచించిన 'సింహావలోకన్' మూడుభాగాల్లో మొదటిభాగాన్ని శ్రీ ఆలూరి భుజంగరావు తెలుగులోకి 'సింహావలోకనం' పేరుతో అనువదించారు.

ఈ పుస్తకంలో ఆనాటి సామాజిక పరిస్థితులు, కాంగ్రెస్‌పార్టీ గాంధీ నాయకత్వంలో అనుసరించిన దళారీ రాజకీయవిధానం, ప్రజల మనోభావాలు, విప్లవ సంఘ

---

నంచే ఆ వర్గం అస్తిత్వానికి మూలమే వైరుధ్యం కాబట్టి" అన్నాడు. 0 అందుచేత సామాజిక వర్గవైరుధ్యాలను, వాటి ఫలితాలను, 'ఏఆచ్ఛాదన లేకుండ', 'ఏసిద్ధాంతము జోడించకుండ', దుఃఖంతోను మళ్లీ ఆనందంతోను, కసితోను మళ్లీ ఆందోళనతోను స్వీకరించడం.

(మిగతా వచ్చే సంచికలో)

కార్యకలాపాలు చాల బాధ్యతాయుతంగా, పాఠకుడిని విసుగెత్తించకుండా యశ్‌పాల్ ఒక నవలలాగా, ఆత్మకథలాగా రాశారు.

ఇందులో అచ్చటచ్చట కొన్ని స్వోత్కర్షలు, అనవసర విషయాలు చోటుచేసుకొన్నా, యదార్థవిషయాల్ని వివరించడంలో రచయిత చాల నిజాయితీని కనబరచినట్లు స్పష్టంగా తెలుస్తుంది.

ఇప్పటిలాగే ఆరోజుల్లోనూ విప్లవకారుల్ని సహజంగా ప్రతివారూ "ఈప్రమాదకరమైన మార్గం ఎందుకు స్వీకరించార"ని అడిగేవారట. అందులో మరో రకమైన ధ్వనికూడా యిమిడివుందంటారు యశ్‌పాల్. "ఏం- గాంధీగారి స్వరాజ్యోద్యమం మీకెందుకు నచ్చలేదు? గాంధీగారి సత్యాగ్రహం నిరపాయమైంది. పోలీసులు పట్టుకొంటే ఆరునెల్లు బి క్లాసు జైలుతోసరి. అందుకు ప్రతిఫలంగా ప్రజల్లో పలుకుబడి-అశేషమైనకీర్తి, పూలదండల్తో ఘనసత్కారాలు లభిస్తాయి. కానీ, మీమార్గం అలాంటిదికాదే? క్రూరజంతువుల్లా రహస్యజీవితం గడపడం పోలీసుల కంటబడితే ఉరికంబానికో, తుపాకీగుండ్లకో ఎరకావడం," కానీ ఈరోజుకూ వందల, వేల యువకులు ఈ కంటకావృత మార్గాన్నే ఎన్నుకొంటున్నారు. కారణం మనకు స్పష్టంగా తెలుసు.

ఆనాటి విప్లవ సంఘం అనుసరించింది టెర్రరిజం కాదని యశ్‌పాల్ యిలా అంటారు.

"విప్లవ కారులకు దౌర్జన్యకారులకు (టెర్రరిస్టులకు) భేదం వుంది. భారత విప్లవకారులు నిరాదర్శమైన, నిర్జీవమైన హింసను ఉపాసించే దౌర్జన్యకారులు కారు. వీరిలో ఆదర్శం వుంది. ఆ ఆదర్శం దేశ కాలపరిస్థితుల ననుసరించి నిరంతరం పరివర్తన చెందుతోంది. ఇదే విషయాన్ని భగత్సింగ్ న్యాయస్థానంలో స్పష్టంగా చెప్పారు. 'ఒక మానవుడిని మరో మానవుడు దోచుకొనే దుష్ట సామాజిక విధానాన్ని అంతం చేయడమే మా ఆదర్శం' అని అన్నాడు."

దీన్నిబట్టి ఆనాడు వారు కేవలం బ్రిటిష్ వారిని భారతదేశం నుండి తరిమేయడమొక్కటే తమ ధ్యేయంగా కాక, దోపిడీలేని ఒక సమాజాన్ని స్థాపించాలనే వున్నత ఆశయంతో ఈ విప్లవ పంథాను చేబట్టినట్లు విశదమవుతోంది.

గాంధీ అనుసరించిన ద్వంద్వ విధానాన్ని తూర్పారపడుతూ అనేక అమూల్య విషయాల్ని రచయిత పేర్కొన్నారు.

గాంధీ సహాయ నిరాకరణోద్యమానికి పిలుపునిచ్చి, పల్లెప్రాంతాల్లో రైతులు కూడ వుద్యమంలో పాలుపంచుకొనడానికి పూనుకోవడంతో ఈ ఉద్యమం తీవ్ర

రూపం దాల్చుతుందనే భయంతో వుద్యమ విరమణకు తానే ఎలాపిలుపిచ్చిందీ, యిల్లూ వాకిలీ వదిలి వుద్యమంలో చేరడానికివచ్చిన అనేక యువకులు ఎలా నిరాశపొందిందీ యశ్‌పాల్ వివరించారు.

'కాంగ్రెస్‌మీద గాంధీమీద పూర్తివిశ్వాసముంచి, ఖద్దర్‌ధరిస్తే స్వరాజ్యం దానంతటదే వస్తుందని ఆనాడు ప్రజల్లో ప్రచారంచేశారు.'

గాంధీ 1921 డిసెంబరునాటికి స్వరాజ్యం సాధిస్తానని ప్రతిజ్ఞచేసి, ఎలా విఫలులైందీ ఈపుస్తకం మనకు తెలుపుతోంది.

ఆనాడు స్వరాజ్యం ఎలా వుంటుందో ఎవరికీ సరిగా తెలియదనీ కానీ. "స్వరాజ్య మంటే ఇంగ్లీషు వారి చేతుల్లో నుండి శాసనాన్ని తమ వర్గపు (ధనికవర్గపు) చేతుల్లోకి తీసికోవడమని నెహ్రూగారికి బాగా తెలుసు. అందుకే వారు గాంధీని విశ్వసించారు" అంటారు రచయిత. ఈ మాటల్లోని యాదార్థ్యం మనకు ఈ 34 సంవత్సరాలుగా తెలుస్తోనేవుంది.

విప్లవకారులుగా తయారు కావడంలో భగత్సింగ్‌కు, సుఖ్‌దేవ్‌కు, భగవతీ చరణ్‌కు, తనకు నేషనల్ కాలేజీ చదువులు ఎలా తోడ్పడ్డాయో, అందులో ఉపాధ్యాయులు దేశంకోసం త్యాగం చేయడానికి తమ నెలా పురికొల్పారో, అచ్చటి లైబ్రరీలో రష్యా విప్లవానికి సంబంధించిన పుస్తకాలను, యితర దేశ విప్లవ చరిత్రలను ఎలా చదివారో రచయిత వివరించారీ పుస్తకంలో.

విప్లవాన్ని ఆత్మరక్షణలాంటి సహజ చర్యగాను, సత్యాగ్రహాన్ని ఆత్మహత్య గానూ తాము భావించామని నిర్భయంగా చెప్పగలిగారు.

భగత్సింగ్, భగవతీ చరణ్‌ల నాయకత్వంలో ఏర్పాటయిన 'నౌజవాన్ కిసాన్ సభ'కు కొందరు అతివాద కాంగ్రెస్ వారు కూడా ఆకర్షితులయ్యారు. దీని వుద్దేశ్యాలను వివరిస్తూ రచయిత "ఈ నౌజవాన్ కిసాన్ సభ ముఖ్య కార్యక్రమం కాంగ్రెస్ దళారీ రాజకీయాల్ని విమర్శించడం, ప్రజల భావాలను ఉగ్రవాద రాజకీయాలకు అనుగుణంగా మార్చి, సాయుధ పోరాటంపట్ల వారిలో సానుభూతిని కలిగించడం"

ఈ కిసాన్ సభ అందించిన నినాదం 'ఇన్ఖిలాబ్ జిందాబాద్' (విప్లవం వర్ధిల్లాలి)

ఈ పుస్తకంలో ప్రతి అంశాన్ని విశదంగా, విమర్శనాయుతంగా వివరించారు రచయిత. తమ సంఘం భగవతీ చరణ్‌ను ఎలా సి. ఐ. డిగా అనుమానించిందీ, సుఖ్‌దేవ్ అరాచకత్వం, భగత్‌సింగ్ గంభీరత రచయిత మన కళ్ళకు కట్టినట్లు రాయగలిగారు.

భగత్‌సింగ్, అతని సహచరులు ఏర్పాటుచేసుకొన్న విప్లవ సంఘానికి 'హిందూస్తాన్ సామ్యవాద ప్రజాతంత్రసేన' అని పేరు పెట్టాడు. తమ సంఘం మార్క్సిజం దిశగా పయనించేందుకు పూనుకొన్నందువల్లనే 'సామ్యవాదం' పదాన్ని చేర్చామని రచయిత స్పష్టం చేశారు.

లాహోర్‌లో సైమన్ కమీషన్ వ్యతిరేక వూరేగింపులో పోలీసులు లాఠీచార్జీ జరిపినపుడు, ఒక చిన్నదెబ్బ లాలాలజ్‌పత్‌రాయ్‌కి ఎలా తగిలింది, దాంతో బెంబేలెత్తి లజ్‌పత్‌రాయ్ పోలీసుల దౌర్జన్యానికి నిరసనగా ఎలా ఊరేగింపును ఆపివేసి, వెనక్కి మళ్ళించమన్నదీ మొదలైన ఆసక్తికరమైన విషయాలు యిందులో చదవగలరు.

సక్రమమైన పథకంతో సాండర్స్‌ను అంతం చేయడం, లాహోర్ నుండి ఎంతో నాటకీయంగా భగత్‌సింగ్ తప్పించుకొని వెళ్ళిపోవడం, అసెంబ్లీలో బాంబులు పేల్చి, తప్పించుకొని పోవడానికి ఎంతో అవకాశమున్నా కావాలని దొరికిపోవడం, బాంబుల ఫ్యాక్టరీపై పోలీసుల దాడి– యివన్నీ ఈ మొదటి భాగంలో యశ్‌పాల్‌గారు చక్కగా చెప్పగలిగేరు.

ఇందులో ఈనాడు మనం గమనించాల్సిన విషయాలు చాలవున్నాయి. అందులో ముఖ్యంగా– ఈనాటిలాగా ఆనాడు విప్లవకారుల్ని కోర్టు విచారణ లేకుండా, అరణ్యాల్లోకి తీసికెళ్ళి పోలీసులు కాల్చేసి, ఎన్‌కౌంటర్లలో మరణించారని ప్రకటించడం లాంటి అమానుషకృత్యాలు ఎక్కడా అగపడవు. మరో విషయం– ఉదయం సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా సాగిన వూరేగింపుపై తీవ్రమైన లాఠీచార్జీ జరిగింది. ప్రజలు ఎంతో ఉద్రేకంతో వూగిపోతున్నారు. సాయంకాలం బ్రహ్మాండమైన బహిరంగసభ అదే ఈనాటి స్థితినాలోచిస్తే– యిలాంటి సంఘటన ఉదయం జరిగివుంటే ఆరోజు నుండి ఓనెల రోజులు నిషేధపు వుత్తర్వులు, ఆ పట్టణంలోనే కాక ఆ రాష్ట్రం మొత్తంలో విధించేవారు. ఇంకా అవసరమనుకొంటే ఆ ప్రాంతాన్ని కల్లోలిత ప్రాంతంగా ప్రకటించేవారు మన ప్రభువులు.

ఈ పుస్తకాన్ని యింతచక్కగారాసి అందించగలిగిన యశ్‌పాల్‌గారిని, ఎన్నో ఆర్థికయిబ్బందులు ఎదురైనా యింతమంచి పుస్తక అనువాదాన్ని ఎన్నో ఆటంకాలను అధిగమించి మనకు అందించగలిగిన ఆలూరి భుజంగరావు గారిని అభినందిస్తున్నాను.

'సింహావలోకనం' మిగిలిన రెండుభాగాల ప్రచురణకు భుజంగరావు గారికి తగిన ఆర్థిక ప్రోత్సాహాన్నివ్వవలసిన బాధ్యత ప్రతి తెలుగు పాఠకుడిపైనా వుందనే విషయం మరువరానిది.

## 2. నేనెందుకు నాస్తికుణ్ణయ్యాను – భగత్‌సింగ్

ఈ పుస్తకంలో "కావలి"లోని 'సొసైటీఫర్ సోషల్‌చేంజ్'వారు భగత్‌సింగ్ రాసిన రెండువ్యాసాలను లూధియానాలోని 'షహీద్ భగత్సింగ్ రీసెర్చి కమిటీ'వారి సౌజన్యంతో తెలుగులో ప్రచురించారు.

"ఒకవైపు మురికివాడలమధ్య గుడిసెల్లో నివసించే లక్షల, కోట్ల నిర్భాగ్యులు, మరోవైపు వ్యర్థంగా పడివున్న సంపదలు, పేదలరక్తాన్నిపీల్చే పెట్టుబడిదారీ రక్కసి జలగలు, పట్టీ పట్టనట్టుగాచూస్తూ దోపిడీకి గురియౌతున్న శ్రామికులు ఏమాత్రం ఆలోచించేవాడికైనా గుండెచెరువయ్యే విధంగా దుబారాఅవుతున్న మానవుల శక్తి యుక్తులు, అదనపుధాన్యోత్పత్తిని కష్టపడి పండించే శ్రమజీవులకందకుండా గంగ పాలు చేసే నిర్దయ, వీటన్నిటినుంచీ అటుమానవుల ఎముకలపోగుల పునాదిమీదలేచిన రాజసౌధాలు" అంటూ భగత్సింగ్ ఈ అసమానతలకు మీ దేవుడిచ్చే జవాబేమిటని ఆస్తికుల్ని ప్రశ్నిస్తాడు.

తాను మొదట్లో కాల్పనిక ఆదర్శవాద విప్లవకారుడినని తర్వాత హేతుబద్ధమైన ఆలోచనాక్రమంలో, మార్క్సిజం ప్రభావంతో శాస్త్రీయ దృక్పథంలో ఆలోచించ గలుగుతున్నానని భగత్సింగ్ తనవ్యాసంలో చెప్పుకొన్నాడు.

ఈ పుస్తకంలో సంగ్రహంగా భగత్‌సింగ్ జీవిత చరిత్రను, అతను టెర రిజం నుండి మార్క్సిజంవైపు పయనించిన తీరును మనకు అందించారు. ఇందులో గాంధీ అనుకొనివుంటే భగత్సింగును రక్షించగలిగి వుండేవాడని కరాచీ కాంగ్రెస్ సమావేశాలకు ముందే అతణ్ని వురితీయమని సిఫార్సు చేయడం సూచనప్రాయంగా కాక బాగా వివరించివుండాల్సింది.

భగత్సింగ్ మరణంకోసం ఎదురుచూస్తూ కూడా జైల్లో దేవుణ్ణి, మతాన్ని ఆశ్ర యించక వాటిని పూర్తిగా నిరాకరించి, నాస్తికుడయ్యాడు. ఆసమయంలోనే అతడు పూర్తి మార్క్సిస్టుగా పరిణతినందాడు.

ఈ చిన్న పుస్తకంలో 'బిపిన్ చంద్ర' పీఠిక సందర్భోచితంగా వుంది.

ఇక భగత్సింగ్ ఎల్.ఎన్. శరణ్‌దాస్ కావ్యసంపుటి 'డ్రీమ్ ల్యాండ్'కు రాసిన ఉపోద్ఘాతం పూర్తి మార్క్సిస్టు దృక్పథంలో వుంది.

'డ్రీమ్‌లాండ్'లో రచయిత మానసిక శ్రమను నిరసించుతూ, ప్రతి ఉద్యోగి రోజు నాలుగ్గంటల కాలం పొలంలోనో, ఫ్యాక్టరీలోనో పనిచేయాలనే వాదాన్ని ఖండిస్తూ భగత్సింగ్ యిలా అన్నాడు. "శరీర కష్టం ఎలా ఉత్పత్తి దాయకమో మానసిక శ్రమ కూడా అలాగే ఉత్పత్తిదాయకమన్న విషయాన్ని బోల్షివిక్కులు కూడా గుర్తించవలసివచ్చింది. వారిద్దరూ ఎంతో ఉత్పత్తికరమైన శ్రమే చేస్తున్నారు, కాయకష్టం చేసే వానికంటే మానసిక శ్రమ చేసేవారు అధికులనే భావాన్ని మాత్రం సోషలిస్టు సమాజం ఒప్పుకోదు".

విద్యగురించి, యుద్ధం గురించి 'డ్రీమ్‌ల్యాండ్'లోని రచయిత భావాల్ని మార్క్సిజం ద్వారా సరిదిద్దడానికి భగత్సింగ్ ప్రయత్నించడం మనం గమనించాలి.

పుస్తకం చిన్నది అయినా అమూల్యమైన వ్యాసాల్ని అందించిన సొసైటీ ఫర్ ఛేంజ్, కావాలి వారిని అభినందించితీరాలి.

ఇక ముందు కూడా యిటువంటి అపురూపమైన వ్యాసాల్ని వాళ్ళు సంగ్రహించి ప్రచురించ గలరని ఆశిద్దాం.



---

**వచ్చే సంచిక నుంచి నడుస్తున్న చరిత్ర పుటల్లోంచి శీర్షిక రెగ్యులర్‌గా వుంటుంది.**

## ఆశ్రితులకు అవార్డులు

1978-79 సంవత్సరానికి ఉత్తమ రచనలకు బహుమతులు ప్రకటిస్తూ మహారాష్ట్ర ప్రభుత్వం ఓ జాబితాను విడుదల చేసింది. అది ఉత్తమరచనలను ఎన్నికచేసే నిపుణుల కమిటీ సభ్యులను ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఆనిపుణులు ఎన్నికచేసిన 31 పుస్తకాల్లో మూడు వదిలేయబడినయ్. అవార్డులిచ్చే సాంప్రదాయం మొదలైనప్పటి నుండీ యీ విధంగా నిపుణులకమిటీ నిర్ణయాన్ని రాష్ట్రప్రభుత్వం లెక్కచేయక పోవడం యిదే మొదటిసారి.

ఈ మూడుపుస్తకాలూ ఓ నిర్దిష్టమైన రాజకీయ దృక్పథంతో రాయబడినందుకే వీటిని నిరాకరిస్తున్నామని రాష్ట్ర అసెంబ్లీలో విద్యాశాఖమంత్రి బలిరామ్ హీరే దాపరికంలేకుండా చెప్పాడు.

### సింహాసన్ :

అరుణ్‌సాధు రాసిన యీనవల ఒక రాజకీయపార్టీ సభ్యులమధ్య అధికారం కోసం జరిగే కుమ్ములాటకు సంబంధించినది. పార్టీలోని ఓముఠా వ్యతిరేకముఠాచేతుల్లో వున్న మంత్రాంగాన్ని పడగొట్టడానికివేసే ఎత్తుగడలను వివరంగా ఈనవల చిత్రించింది. అధికారాన్ని చేజిక్కించుకోవడానికి శాసనసభలోనూ, బయటాకూడా వాళ్ళు చేసే అక్రమచర్యలను ఇది చూపుతుంది.

దీన్ని యిటీవలే జబ్బార్‌పటేల్ మరాఠీలో సినిమాగా కూడ చిత్రీకరించాడు.

### జనాంచా ప్రవాహోచాల్‌లా

వినయ్ హర్దికర్ జైల్లో వున్నప్పుడు జనసంఘ్ వాళ్ళతో కలిసి గడిపినప్పటి అనుభవాలతోపాటు బయటి సమాజంతో ఆయనకుగల అనుభవాలను, ఆలోచనలను కూర్చిన రచనలకూర్పుయిది.

### లోక్‌నాయక్ జయప్రకాశ్

ఇది మూడవది. బి. ఎన్. రాజన్స్ రాసిన జె.పి. జీవితచరిత్రయిది.

ఈ పుస్తకాలన్నీ ఎమర్జెన్సీ కాలంలోనూ, ఆతర్వాతా రాయబడినవి కాబట్టి ఆయా రచయితల అప్పటి అనుభవాలు వాటిల్లో ప్రతిబింబించాయి. మహారాష్ట్రలో సాహిత్యంతో పరిచయమున్న చాలామంది యీ పుస్తకాల్ని నిరాకరిస్తూ ప్రభుత్వం తీసుకున్న చర్యకు తమనిరసన తెలిపారు. ఎందుకంటే వాటికున్న సాహిత్యవిలువలు

ఉన్నతమైనవి. అదేసమయంలో అసెంబ్లీలో కాంగ్రెస్-ఐకి చెందిన వందిమాగధులు యీ పుస్తకాలను నిషేధించాలంటూ డిమాండ్ చేశారు.

బహుమతులు ప్రకటించబడిన మిగతా రచయితల్లో చాలా మంది ప్రభుత్వ చర్యకు నిరసనగా తమ అవార్డులను తిరస్కరించారు. బహుమతి గెలుచుకున్న కవితా సంపుటి సలామ్ రచయిత మంగేష్ పడ్గోంకర్ కూడా తన అవార్డులను తిరస్కరించాడు. తిలక్, అగార్కర్‌లపై రాసిన తన పుస్తకానికి వచ్చిన అవార్డును ప్రొఫెసర్ వై. డి. ఫడ్కే, అవార్డులు పొందిన ఇతర రచయితలు ఎ. ఎస్. పద్నీకర్, మహావీర్ జొండెలె, వసంత్ బాపట్, రత్నాకర్ మత్కారి మొదలైన వాళ్ళంతా తమ తమ అవార్డులను తిరస్కరించారు. ఇటీవలే ఏర్పాటైన సాహిత్య సాంస్కృతిక మండలి సభ్యత్వానికి కూడా ప్రొఫెసర్ ఫడ్కే రాజీనామా చేశారు.

మరాఠీలో పుస్తక ప్రచురణలు సాగిస్తున్న గ్రంథాలి అనే ఒక ప్రచురణ కర్తల సంస్థ రాష్ట్రప్రభుత్వం అవార్డులను ప్రదానంచేసే రోజునే ఓ కార్యక్రమాన్ని నిర్వహించడానికి సన్నాహాలు చేస్తున్నది. ఆదేరోజు ఆయా రచయితలకు వాళ్ళ రచనలపేర 'లోక్ పారితోషక్' (ప్రజా బహుమానాలు) కూడా యివ్వాలని నిర్ణయించుకున్నది. ఇదే సందర్భంలో మరాఠీ సాహిత్యకారుల్లో జరుగుతున్న చర్చను యీ సంఘటన మరోసారి ముందుకు తెచ్చింది. ప్రభుత్వానికీ రచయితలకూ మధ్య ఎట్లాంటి సంబంధాలుండాలనేదే వాళ్ళను ఆలోచనలో పెడుతున్న చర్చ. రచయితలు తమకు స్వేచ్ఛ ఉండాలనుకుంటే ప్రభుత్వంతో సంబంధాలేమీ లేకుండా సంపూర్ణ స్వతంత్రతతో వాళ్ళు మెలగాలని దుర్గాభగవత్ లాంటి కొందరు వాదిస్తున్నారు. వాళ్ళు ఆర్థిక సహాయాన్నిగాని, ప్రభుత్వ గ్రాంట్లనుగానీ, అవార్డులను అంగీకరించడంగానీ, లేదా ప్రభుత్వం నియమించే కమిటీల్లో ఏ హోదానుగానీ అంగీకరించకూడదు. కాని ఎక్కువమంది రచయితలు రచనాస్వేచ్ఛను కోరేహక్కు తమకున్నదనీ, ప్రభుత్వ జోక్యాన్ని తిప్పికొట్టే హక్కు తమకున్నదనీ భావిస్తున్నారు. అదే సమయంలో వీరు ప్రభుత్వం నుంచి ఆర్థికసహాయాన్ని పొందవచ్చుననీ, ప్రభుత్వంచే నియమించబడే కమిటీల్లో పనిచేయవచ్చుననీ, ప్రభుత్వం ఇచ్చే ఆర్థికసహాయం ప్రజలడబ్బేనని, ప్రభుత్వం నియమించే కమిటీలు ప్రజలకే బాధ్యత వహించాల్సి వుంటుందనీ వాదిస్తున్నారు.

సాహిత్య ప్రపంచం నుంచి దూరం కావడానికి అంతూలే ప్రభుత్వం యింత కన్నా చేయగల మంచి ప్రయత్నం ఏముంటుంది!

— అనూరాధ

సాహిత్య లేఖలు :

## అనుభూతి అంటే శిల్పం కాదు

సృజన 112-113 సంచికలోని శ్రీ త్రిపురనేని మధుసూదన్‌రావుగారి వ్యాసం చదివి, యీ రెండుముక్కలు రాస్తున్నాను.

ఆయన తనవ్యాసంలో ఒకచోట (61వ పుట) ఈ క్రిందివిధంగా అన్నారు :

"సాంప్రదాయవాదుల్లా వీళ్ళు (అంటే అభ్యుదయ విమర్శకులు) "కవిత్వానికి హృదయమే కేంద్రం" "కవిత్వానికి అనుభూతి జీవధాతువు" (రా. రా. సారస్వత వివేచన) అంటూ శిల్పవాద ప్రభావంలోపడ్డారు".

ఈ ముక్కచదివితే అనుభూతిఅన్నా, శిల్పంఅన్నా ఒకటేఅని మధుసూదనరావుగారు పొరపడుతున్నారనిపిస్తుంది. అనుభూతి (లేక Emotion) అనేది కవిత్వం యొక్క, (లేదా కళయొక్క) మౌలికగుణం. కాగా శిల్పంఅనేది, కవిత్వంలో అనుభూతి లేక రసం నింపడానికి కవిఉపయోగించేపద్ధతి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే రసం End అయితే శిల్పం Means వంటిది. అంతేకానీ అనుభూతీ, శిల్పమూ ఎప్పటికీ ఒక్కటికావు

ప్రాచీన కాలంలోనేకాదు యేకాలంలోఅయినా "కవిత్వానికి హృదయమే కేంద్రం". అంటే మనల్ని అనుభూతి అర్ణవంలో పడవేయని కవిత్వం, కవిత్వమే కాదు హృదయాలను కరిగించడంఅన్నది కళ లేదా కవిత్వంయొక్క మౌలికగుణం. ఈగుణం లోపించింది కవిత్వమూకాదు, కళాకాదు.

అయితే హృదయమూ, మెదడూ రెండూకూడా సెంట్రల్ నర్వస్ సిస్టమ్‌లో భాగాలే కాబట్టి వాటిని మరీ విడదీయబడిన, అంతర్గత సంబంధాలులేని పదార్థాలుగా చూడలేము. కవిత్వం హృదయాలను కరగించేమాట నిజమే, చైతన్యపరిధిని విస్తరించే మాటానిజమే. ఒక్కమాటలో చెప్పాలంటే కవిత్వం (లేదా సాహిత్యం) మనిషి సంస్కారాన్ని ప్రభావితం చేస్తుంది. అచ్చంగా అదే కవిత్వవ్యాపారం (Function.)

"సాహిత్యాన్ని అస్వాదించడానికైనా, విమర్శించడానికైనా హృదయ సంస్కారమూ, మేధోపరిపాకమూ రెండూ అవసరమైనట్లే" సాహిత్యం హృదయసంస్కారాన్ని పెంచుతుంది, మేధోపరిపాకాన్ని పెంచుతుంది. ఇందులో మొదటిది Primary, రెండోది Secondary. ఈ క్రమం తప్పిందంటే, అనగా కేవలం మేధోపరిపాకాన్నే పెంచేదైతే అది Social science కావచ్చు, మరొకటి కావచ్చుకానీ సాహిత్యంకాదని పిస్తుంది.

ఉదహరణకు శ్రీశ్రీ గారి "ఉన్మాది"అన్న గేయమే తీసుకుందాం. పెట్టుబడిదారీ అస్తవ్యస్త వ్యవస్థ సృష్టించిన, సమాజంచేత తిరస్కరింపబడి, పిచ్చెత్తిన ఒక దయనీయమైన వ్యక్తిని శ్రీశ్రీ ఇందులో చిత్రించాడు. ఆవ్యక్తిని శ్రీశ్రీ కరుణరస ప్లావితంగా చిత్రించాడు. చదవగానే ఆ కరుణరసంలో తేలిపోతాము. తరువాత ఆ వ్యక్తి యొక్క సామాజిక స్థితినిగురించి ఆలోచిస్తాము. ఈ రెండుక్రియాలు దాదాపు యేకకాలంలోనే జరిగినా మొదట అనుభూతికి, తర్వాత ఆలోచనకు పని అప్పగించబడింది. ఈవిషయం తెలియడానికి పెద్ద అతీంద్రియజ్ఞానం అక్కర్లేదను[illegible]

రా. రా. వాడిన అనుభూతిఅనే పదానికీ శ్రీకాంత్‌శర్మ వగైరాలు వాడుతున్న అనుభూతివాదం అన్న Term కూ ఒకేఅర్థం యివ్వకోవటం పొరపాటు.

రసంపట్ల అనుభూతిపట్ల మధుసూదనరావుగారికి ఎందుకో Contempt వున్నట్లుంది. అలాటి Contempt వున్నవాళ్లు కవిత్వాన్ని లేదా సాహిత్యాన్ని Social science గా మాత్రమే పరిగణిస్తారు. కళలు లేదా కవిత్వం మనిషి హృదయ సంస్కారాన్ని ప్రభావితం చేస్తుందన్న దాని Special function ను గుర్తించలేదు. హృదయ సంస్కారంలో మార్పువచ్చిన వ్యక్తి (అది ఎలావచ్చినా) విప్లవ కార్యాచరణకు కూడా సంసిద్ధమవుతాడు.

— సోదుం రామ్మోహన్
విజయవాడ

## 'మౌనం' కవిత గురించి

శంకరపిళ్ళై కవిత 'మౌనం' అనువాదం (జనవరి సంచిక)లో రెండు తప్పులు దొర్లాయి.

7వ పేజీలో కేదారనాథ్ ఫల్లూలు అనేవాక్యాన్ని 'కేదారనాథ్‌లో శివలింగం' అనీ, అదే పేజీలో 'పవిత్ర ద్వారానికావల వుంచబడ్డ సంతాల్‌లు' బదులు 'పవిత్ర ద్వారానికావల వుంచబడ్డ పాదరక్షలు' అని చదువుకోవాలి.

8వ పేజీలో 'శిలువవేసేద్రోహి' అనే మాటకు కూడా వివరణ ఇవ్వడం అవసరం. ఏసుక్రీస్తు పట్టుబడడానికీ, శిలువవెయ్యబడడానికి 'జుడాస్' అనే మిత్రునిద్రోహం కారణం. ఈ కవితలో 'శిలువవేసేద్రోహి' అనే వాక్యం 'జుడాస్'ను ఉద్దేశించింది.

— అనువాదకుడు

## చీకటి రక్కసి సర్పము పట్టి కరచు వేళ....

తెలుగు కవితలయినా, అనువాద కవితలయినా, ఇటీవల కాలంలో సృజనలో చ్చిన కవితలన్నింటిలోనూ తలమానికమయిన కవిత జనవరి సంచికలో ప్రచురించిన ంకరపిళ్ళె 'మౌనం'. కవిత పరోక్ష అనువాదమే అయినా (మలయాళీ - ఇంగ్లీషు - లుగు) అంత బలంగా రావడానికి కవితీసుకున్న వస్తువులోని వైశాల్యం, ప్రతీక రణం [illegible] కోవాలి. ఇంతకీ ఈ కవిత తెలుగులో వస్తున్న విప్లవ కవితకు చాలా ontrast కావడం గమనించాలి. చాలా వరకు తెలుగు విప్లవ వచన కవిత ప్రకృతిని, అరిగిపోయిన ప్రతీకలను తీసుకుంటూవస్తున్నదే. పాటలలో కూడా అది ప్రతిఫలించినా అక్కడ శబ్దసంగీతం దాన్ని రక్షిస్తోంది. వచన కవితే తన ప్రతీకలలో నిలిచిపోతున్నది. శంకరపిళ్ళె రోజువారీ జీవితంలో మనం గుర్తించని చిన్న చిన్న వాటిని (trivialities) పిల్లి, పోస్ట్‌బాక్స్, కాఫీ, పేవ్‌మెంట్ - విప్లవ కవిత్వానికి ప్రతీకలుగా వాడుకొని 'కాదేదీ కవితకనర్హం' అని రుజువు చేసాడు. మారు మూల గ్రామాల్లో బిక్కచచ్చిన పిల్లల నుండి నగరాల్లో ఏ గమ్యంలేని యువతరం దాకా అందరి జీవితాలలోనూ ఉండే మౌనానికి యమునానదీ తీరంపైఉన్న పార్లమెంటు రాక్షససర్పపు భయంకర మౌనంతో ఉన్న సంబంధాన్ని వివరించి శాస్త్రీయ దృక్పథంతో కవి అనుభూతికి ఉండే ఏకత్వాన్ని అద్భుతంగా నిరూపించాడు. ఆలోచనకూ అనుభూతికీ మధ్య యాంత్రికమయిన విభేదాన్ని చూపించి కమిటెడ్ కవిత్వాన్ని విమర్శించే వాళ్ళకు ఇది సృజనాత్మకమైన సమాధానం.

— ఒక పాఠకుడు

---

వచ్చే సంచికలో

పుస్తక పరిచయం : **రగులుకునే రాక్షసిబొగ్గు (ఈశాన్య భారత్ రాజకీయార్థిక పరిచయం)**

సమీక్ష : **ఏడుతరాలు (Roots)**

SRJANA Telugu Monthly April 81 H/WL-10
Regd. No. with Registrar of Newspapers 10953/67.

# మీరు రక్షించుకోకపోతే
# రెండు మూడు నెలల్లో సృజన ఆగిపోతుంది ........

అవును. రెండు మూడు నెలల్లో సృజన ఆగిపోవలసిన పరిస్థితి వస్తోంది.

ఆర్థిక ఇబ్బందులవల్లనే ఫిబ్రవరి మార్చ్ సంచికలు కలిపివేసామని 2 రూపాయలకు 80 పేజీలు ఇస్తామని హామీఇచ్చి 70 పేజీలే ఇవ్వగలుగుతున్నామని మీరు గమనించేవుంటారు.

ప్రస్తుతం సృజన ఐదువేల రూపాయల అప్పుతోఉంది.

బకాయిలు చెల్లించని ఏజెంట్లూ, చందాలు సక్రమంగా చెల్లించని అభిమానులూ, పెరుగుతున్న పేపర్ ధరలూ, ప్రింటింగ్‌చార్జీలు ఇందుకుకారణం.

డబ్బు బకాయివున్న ఏజెంట్లకు సృజన పంపకుండా వుందామని కాపీలు తగ్గించినా అప్పు పెరుగుతూనేఉంది. ఒక్కొక్క సంచికకు దాదాపు రు 2000-00 ఖర్చవుతున్నది. దాదాపు 100 కాపీలు జైళ్ళలోవున్న కామ్రేడ్స్‌కు, ఏ పారితోషికమూ లేకుండా సృజనకు రచనలుచేస్తున్న రచయితలకు, ఇతర మిత్రులకు ఉచితంగా పంపవలసి వుంటుంది. మిగిలినకాపీల్లో దాదాపు 400 చందాలు. ఈ 400 కాపీల్లోనూ సరిగా డబ్బుచెల్లించనివీ, సృజనవద్ద నికరంగా డబ్బు ఉన్నవీ చాలాతక్కువ.

దాదాపు రు. 2000-00ల ఖర్చుకుబదులుగా ప్రతినెలా దాదాపు రు. 600-00 వసూలవుతున్నాయి. రు. 1000-00 చందాల బాపతుడబ్బో పుస్తకాలమ్మినడబ్బో కలిసినా ప్రతినెలా రు. 400-00 లోటు వస్తున్నది.

ఇక ఈ పత్రికను రక్షించుకోవలసింది మీరే-

*ప్రతి జిల్లాలోనూ కనీసం 100 చందాలు చేర్పించండి.

*ప్రతి చిన్నపట్టణంలోనూ సృజనకు ఏజన్సీ ఏర్పాటు చేయించండి.

## సృజన మీ పత్రిక సృజన ప్రజల పత్రిక
## సృజనను రక్షించుకోండి—

SRJANA
Hanamkonda-506001

Single copy 2-00
Yearly Subscription Rs 20-00